Sravanthi Book Series-2

April, 1991

CHIGURINCHINA GULABI

By

POTLURU SUBRAHMANYAM, M.A.,
Post Box No. 47
Achari Street,
Nellore-524 001, A. P.

Publishers,
MAHIDHAR PUBLICATIONS,
Poolathota Street,
Kovur-524 137,
Nellore Dt., A. P.

Price :
Rs. **25-00**

Cover Design
RAJI

Printers
K. P. Nellore.

# అంకితం



శ్రీ జక్కా కోదండరామిరెడ్డిగారికి

# తొలి పలుకులు

శ్రీ పోట్లూరు సుబ్రహ్మణ్యంగారు చెయ్యి తిరిగిన కథకులు.

ఈ 'చిగురించిన గులాబీ'లో ఎనిమిది మొగ్గలున్నవి.

ఏ మొగ్గకు ఆ మొగ్గే స్వతంత్రమైనా, 'ఈ ప్రశ్నకు బదులేది' అనే తొలిమొగ్గకు, 'చిగురించిన గులాబి' అనే తుది మొగ్గ సమాధానము.

మన పూర్వులు 'అష్టవర్షాభవేత్కన్యా' అని భావించి, యెనిమిదేండ్లు నిండకముందే ఆడుపిల్లకు పెండ్లి చేసివేసేవారు. అంటే, ఆ పసిపిల్ల మనసులో స్త్రీ పురుష భేదం పొటమరించే టప్పటికి పక్షికి జంటపక్షి ప్రక్కన ఉన్నట్లు భర్త ఉంటాడు. ఆమె మనోముకురంలో మరొక పురుషుని నీడకూడ పడకూడదని వారి ఆశయం.

ఇపుడు కాలం మారింది. పునర్భూ పరిగ్రహణం పురుషోత్తమలక్షణమై, ఆధునిక లోకంలో అభినందనపాత్రమైనది. వంగ దేశవాసనా వాసితమైన వార్థితీరాంధ్రప్రాంతంలో సంస్కరణాత్మక కథాసాహిత్యం వెల్లి విరిసింది. ఆ త్రోవలో శ్రీ పోట్లూరి వారి కలం రాజనాలు పండించింది.

'మనసులోని చీకటి' కథలో ఉపనాయకుడు సనాతన సంప్రదాయవాది కాకపోయినా ఉచ్ఛిష్టం అంటే ఏవగించుకొనే స్వభావం కలవాడు. అది వాని మనసులోని చీకటి. ఆ చీకటి విచ్చిపోయి, పురుషుల మనసుల్లో విశాలానసరణమైన వెన్నెల కాసే శుభపరిణతి రావాలని నాయికయొక్క ఆశంస.

'రక్తంలో రంగులు' అంతరంగ గుణాలు. నలుపు తెలుపు బహిరంగ వర్ణాలు. నల్లని దేహచ్ఛాయ గలవారిలో దుష్టరక్తం, తెల్లని దేహచ్ఛాయ గలవారిలో శిష్టరక్తం ఉంటుందని భ్రమపడ గూడదు. అందానికి, శరీరవర్ణానికి అనుబంధం లేదని తార్కా ణించే కథయిది.

'విముక్తి' అనే కథ "మనఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయో:" అనే ఉపనిషదుక్తికి వివృతి.

'ఱెక్కలు తెగిన పక్షులు' చదువుకొని ఉద్యోగం వెలిగించి ఉద్ధరిస్తారనుకొన్న కొడుకులు పట్నంలో కాపురంపెట్టి భార్యా దాసులై, తలిదండ్రులకు చిప్ప చేతికిస్తారు. విచిత్రమైన మఱొక విశేష మేమంటే, అన్నగారి అన్నం తిని చదువుకొన్న తమ్ములు సంపన్నులై, కాలేజీలో చదవడానికి పట్నం వచ్చిన అన్న కుమా రునికి అన్నం పెట్టరు. పితృద్రోహము, జ్యేష్ఠ భ్రాతృ ద్రోహము క్షంతవ్యములు కావు.

'అద్దె యిల్లు సొంత యిల్లు' ఎవరియిక్కట్లు వారికున్నవి.

'మహాత్ములకు చావులేదు' కథలో నిజాయితీకి బ్రతుకు లేదని పిండితార్థం.

సంసారప్రాంగణంలో అడుగుపెట్టబోయ్యే యువతీయువకులు ఈ కథలు చదివితే నిస్సందేహంగా బాగుపడతారు. కావలసినంత లౌకికజ్ఞానం కూడ కలిసి వస్తుంది.

ప్రొద్దుటూరు,
తే 24-4-1991 ది

డా. సి. వి. సుబ్బన్న
శతావధాని.

# అభినందన

శ్రీ పోట్లూరు సుబ్రహ్మణ్యం చిన్ననాడు నా విద్యార్థి. ఈనాడు అధునికాంధ్ర సాహితీ లోకంలో లబ్ధ ప్రతిష్టులైన కథకులు.

విశ్వసాహిత్యంలోనే కథకు ఒక ప్రత్యేక స్థానమున్నది టాల్‌స్టాయ్, విశ్వకవి రవీంద్రుడు. ఓహెన్రీ మొదలగు మహనీయులు కథా కథనశిల్పంలో అగ్రశ్రేణి మూర్తిత్రయం. అధునికాంధ్ర సాహిత్యంలో కూడా కొందరు కథా రచయితలు ఉత్తమ రచనలు సృష్టిస్తూనే ఉన్నారు.

శ్రీ పోట్లూరి కూడా చేయితిరిగిన మంచి కథకులు.

'చిగురించిన గులాబీ' అనే సంపుటంలో వారు ఎనిమది గులాబీలను విరబూయించారు.

ఈ సంపుటిలో "రెక్కలు తెగిన పక్షులు" అనే కథమకుటాయమానం. అధునికి నాగరికత దిద్దితీర్చిన యాంత్రిక జీవితాలలో మానవత్వపు విలువలకు స్థానం లేదని నిరూపించిందీ కథ. 'రక్తంలో రంగులు' 'విముక్తి' అనేకథలు ఆలోచనా మృతాలు.

ఇంత చక్కటి కథలను దిద్దితీర్చిన శ్రీ సుబ్రహ్మణ్యంను మనసారా అభినందిస్తున్నాను.

నెల్లూరు,
తే 26-4-91 ది

మోనా

# నా మాట

ఎందరో మహానుభావులు - అందరికీ వందనాలు.

ఇది మహీధర్ పబ్లికేషన్స్ నుంచి వస్తున్న నా రెండవ కథల సంకలనం. ఇందులో ఎనిమిది కథలున్నాయి.

సింహపురి నివాసులు, స్థానిక ఎమ్. ఎల్. ఏ. శ్రీ జక్కా కోదండరామిరెడ్డిగారు సహృదయులని, వారికి కళలంటే అభిమానమని, కళాకారులను బాగా ప్రోత్సహిస్తారని, వారి మంచితనం గురించి చాలామంది చెప్పగా విని ఈ రెండవ కథా సంకలనాన్ని వారికి అంకిత మివ్వడం జరిగింది. వారు అంకితం తీసుకొన్నందుకు కృతజ్ఞుడను.

ఈ కథా సంకలనానికి కవిపండితుడు, బహుగ్రంథకర్త శతావధాని డాక్టరు సి. వి. సుబ్బన్న గారు తొలిపలుకులు వ్రాయడం నా అదృష్టంగా భావిస్తున్నాను. వారికి నా కృతజ్ఞతలు. అలాగే అభినందన పేరుతో మలిపలుకులు వ్రాసిన ప్రముఖకవి, కేరళ అవార్డు గ్రహీత శ్రీ మోనాగారికి కృతజ్ఞుడను.

ఇకపోతే ఇందులోని కథలగురించి. నేడు బ్లాక్ మెయిలింగు అనేది అత్యంత అధునికమైన వైట్ కాలర్ క్రైమ్. మొదటి కథలో వైట్ కాలర్ క్రిమినల్ ఝాన్సీ ప్రపంచప్రఖ్యాతిగాంచిన క్రిమినాల జిస్టులు గోరింగ్, హెూటన్, గ్లక్‌లనిర్వచనాలకు అందనిస్థాయిలో బ్లాక్ మెయిల్ చేస్తుంది. చివరకు తను ఇలా కావడానికి కారణమైన సమాజాన్నే 'ఈ ప్రశ్నకు బదులేది?' అంటూ సమాధానం లేని ప్రశ్నవేస్తుంది. ఒన్ వే లవర్ విజయకూమార్, కృష్ణవేణిని

అవమానించబోయి తనే ఘోరంగా అవమానింపబడతాడు. చివరకు కృష్ణవేణి ఎంతో ప్రయత్నించికూడా అతని 'మనములోని చీకటి' ని పారద్రోలలేక పోతుంది తనకు ధనం లేక పోయినా అభిమాన ధనం ఎక్కువని 'విముక్తి' కథలో ముకుందరావు నిరూపిస్తాడు. కృతజ్ఞత, కృతఘ్నత అన్న రెండు పదాలకు సరైన నిర్వచన మిచ్చే సంఘటనలు ప్రభాకరం జీవితంలో జరిగి అతను, అతని భార్య 'రెక్కలు తెగిన పక్షులు' అవుతారు

సొంత ఇంటి సుబ్బారావు, అద్దెఇంటి అప్పారావు తమ తమ బాధల్ని 'సొంత ఇల్లు-అద్దెకొంప' కథలో వెళ్లబోసుకుంటారు కమల, పరిమళ స్నేహఫలితంగా ప్రతాప్ ఆనంద కరమైన జీవితంలో పెనుతుఫాను చెలరేగి, చివరకు కనిపించని 'రక్తంలో రంగులు' ఎన్నో ఉంటాయని తెలియచేస్తుంది. తనుచిన్నతనంలో విన్న సమాజానికి, వయసొచ్చిన తరువాత చూసిన సమాజానికి, అందులో జరిగే అన్యాయాలకు చలించి, ఎదిరించి, రాము అనే కాలేజి కుర్రవాడు మహాత్ములలో కలసి 'మహాత్ములకు చావు లేదు.' అని నిరూపిస్తాడు. ఇకపోతే చివరికథ టైటిల్ కథ అయిన 'చిగురించిన గులాబి' 1971-1974 సం॥ల మధ్యకాలంలో కావలి జవహర్ భారతిలో నేను చదువుకొనే రోజుల్లో కందుకూరి వీరేశలింగం పంతులు, రాజారామ మోహనరాయలు వంటి సంఘ సంస్కర్తల రచనలు చదివి ఆ ప్రభావంతో వ్రాసిన కథ. చాల సంవత్సరాల తరువాత ఇది పత్రికలో ప్రచురింప బడింది. ఇందులో వసంత ఎడారిలాంటి జీవితంలో వెన్నెలలు ఎలా వెల్లివిరిసింది తెలియ జెప్పబడింది.

పై కథలన్నీ గతంలో ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, ఆంధ్ర భూమి వారపత్రికలలోనూ, స్వాతి, యువమాస పత్రికలలోనూ

ప్రచురింపబడ్డవే. సదరు పత్రికా ఎడిటర్లకు, వారి సిబ్బందికి నేను కృతజ్ఞుడను. ఈ సందర్భంగా సాహితీ పరంగా నన్ను ప్రోత్స హించే శ్రీ ఆర్. శ్రీశైలంగారికి మరి కొందరు మిత్రులకు కూడా కృతజ్ఞతలు తెలియచేసు కొంటున్నాను.

పై కథలు చదివి. వాటిమీద తమ అమూల్యమైన అభి ప్రాయాల్ని తెలియ జేయవలసినదిగా పాఠకులకు మనవి చేసు కొంటున్నాను.

నెల్లూరు. మీ,

తే 28-4-91 ది పోట్లూరు సుబ్రహ్మణ్యం.

# ని వే ద న

ఇది మా పబ్లికేషన్స్ నుండి వస్తున్న రచయిత శ్రీ పోట్లూరు సుబ్రహ్మణ్యంగారి రెండవ కథల సంకలనం. కొందరు మహనీయుల ఆర్థిక సహాయమే ఈ పుస్తకం వెలువడ డానికి తోడ్పడింది.

ఈ కథా సంకలనాన్ని సహృదయులు స్థానిక ఎమ్మెల్యే శ్రీ జె. కె రెడ్డిగారు అంకితం స్వీకరించడం, తొలిపలుకులు ప్రముఖ కవి పండితులు డాక్టరు సి. వి. సుబ్బన్న శతావధానిగారు వ్రాయడం, మలి పలుకులు ఈ సింహపురి కవి శ్రీ మోనాగారు వ్రాయడంవలన, పుస్తకానికొక ప్రత్యేక విలువ కలిగినట్లుగా మేము భావిస్తున్నాము. వారందరికీ మా కృతజ్ఞతలు.

ఈ పుస్తకానికి అందంగా ముఖచిత్రం వేసి ఇచ్చిన శ్రీ రాజీగార్కి, దాన్ని ఇంకా అందంగా ముద్రించి ఇచ్చిన నయాగరా బుక్స్ అధినేతలకు కృతజ్ఞులము.

మొదటి పుస్తకంతో బాటు, ఈ పుస్తకాన్ని కూడా ఆదరించి మాతో సహకరిస్తారని ఆశిస్తున్నాం.

కోవూరు, 　　　　　　　　పబ్లిషర్స్.

తే 30-4-91 ది

# విషయసూచిక





# మనవి

పై కథలు, అందులోని సంఘటనలు, సన్నివేశాలు కేవలం కల్పితం. ఎవరినీ ఉద్దేశించి వ్రాసినవి కావని, ఎవరికీ, దేనికీ ఎట్టి సంబంధం లేదని ఇందుమూలంగా మనవి చేసుకొంటున్నాను.

రచయిత.

# ఈ ప్రశ్నకు బదులేది?

అనిల్‌కుమార్ కాంపౌండు గేటు తీసుకొని లోపలికి ప్రవేశించగనే,

"బాబూ! నీకో ఉత్తరం వచ్చింది" అంటూ ఒక కవరు అందించింది నాగరత్నమ్మగారు.

ఆమె ఆ ఇంటి యజమానురాలు. ఆమె, ఆమె భర్త తప్ప ఆ ఇంట్లో మరెవ్వరూ లేరు. ఆమె ఇద్దరు కొడుకుల్లో ఒకరు ఢిల్లీ లోను, మరొకరు కలకత్తాలోనూ ఉన్నతోద్యోగాలు చేస్తున్నారు. అనిల్‌కుమార్ మీద ఆమెకు సదభిప్రాయముంది. కారణం అతని నడవడిక, క్రమశిక్షణ ఆమెను ఆకర్షించడమే.

అనిల్‌కుమార్ మేడ వెనుక వైపుకు వెళ్ళి మెట్లెక్కి మేడ మీదున్న తన గదిని చేరుకున్నాడు. అలసటగా కుర్చీలో కూర్చొని ఉత్తరం చించాడు....

"చిరంజీవి అనిల్‌కుమార్‌కి మీ తండ్రి ఆశీర్వదించి వ్రాయడం-

ఇక్కడ మేము క్షేమముగా ఉన్నాము. నీ క్షేమములు తెలియరావడం లేదు. నీవు పోయిన నెలలో పంపిన డబ్బు అంది నది. ఈ ఉత్తరం వ్రాయడానికి ముఖ్య కారణం, ఇక్కడ నీకు పెళ్ళి సంబంధాలు వస్తూండడమే. ఇరవై వేల నుంచి అరవై వేల వరకు కట్నం ఇస్తామంటున్నారు. నిన్న బ్రిటగుంట నుంచి ఒకా యన మన వూరికి వచ్చాడు. మనకు దూరపుబంధువు. నీకు వరు సకు మామ అవుతాడు. వాళ్ళ అమ్మాయిని ఇస్తామంటున్నాడు. అమ్మాయి పేరు వసంత. కట్నం యాభై వేలు డబ్బు, ముప్పై

అయిదు సవర్లు బంగారం పెడతానంటున్నాడు. అంటే లక్ష రూపాయల ఆస్తన్నమాట.

దీనికి మేము సుముఖంగా ఉన్నాము. అమ్మాయిని చూస్తే గాని ఏ విషయం చెప్పమని చెప్పాను. వచ్చే నెల పదవ తేది పెళ్ళి చూపులకు నిర్ణయించాము. మీా అమ్మ ఈపెళ్ళికి చాలా ఇష్టపడుతూ ఉంది. కనుక నీవు తొమ్మిదవ తేదీ మన వూరికి వస్తే, ఇక్కడి నుంచి వెళ్ళి అమ్మాయిని చూసి ఏ విషయమూ నిర్ణయిస్తాము. అట్లాకాదు మమ్మల్నే వెళ్ళి చూసి రమ్మన్నా ఆరోజు వెళ్ళి చూసి వస్తాము. ఏసంగతికీ వెంటనే జవాబు వ్రాయి. ఈ సంవత్సరంలోగా కోడలిని తెచ్చుకోవాలని మీా అమ్మ చాలా పట్టుదలగా ఉంది. ఇక నీ ఇష్టం.

ఇట్లు,
నీ తండ్రి
నరసయ్య.

అనిల్‌కుమార్‌కి మనసు మనసులో లేదు. అతనికి ఆడ వాళ్ళంటే తగని సిగ్గు. ఇంకో రకంగా ఏహ్యాభావం. ఉండడానికి వయస్సు ఇరవై ఆరేళ్ళున్నా ఆడదాని విషయానికొస్తే ఆరేళ్ళ లోపే అనవచ్చు ఇప్పటికీ పదేళ్ళుమించిన అమ్మాయిని తేరిపార చూడాలన్నా సిగ్గు. తలవంచుకుని వెళ్ళిపోతుంటాడు. హైస్కూలు నుంచి కాలేజీ వరకు కో ఎడ్యుకేషన్ కాలేజీలో చదవలేదు. నవల్లు కథలు చదివే అలవాటు అసలే లేదు. దాంతో అతను సొసైటీలో ప్రధమపాత్ర వహించే సోషల్ రిలేషన్స్‌కు దూరమయ్యాడు.

అయితే అనిల్‌కుమార్‌కు తన స్నేహితులు ఎందుకు అలా అమ్మాయిల గురించి కబుర్లు చెప్పుకుంటారో అర్థమయ్యేది కాదు. 'ఛ' ఎందుకురా ప్రొద్దస్తమానం ఆడపిల్లల గురించి కబుర్లు?' అనే

వాడు. 'నువ్వో వెధవ్వో ఎవరినయినా ప్రేమించి చూడు. అప్పుడు తెలుస్తుంది అందులోని మజా' అనేవారు. కాలక్రమంలో అతని స్నేహితుడు రాఘవరావు ప్రేమలో పడి. ఆ అమ్మాయి వేరొకరిని పెళ్ళిచేసుకోవడంతో ట్రెయిన్ క్రింద తలపెట్టి మరణించాడు. దీంతో అతనికి ఆడపిల్లలమీదున్న ఏహ్యాభావం ద్వేషంగా మారింది. అందుకే అమ్మాయి లంటే తగని మంట.

అనిల్‌కుమార్‌కి ఈ మధ్యనే బాంకులో ప్రొబేషనరీ ఆఫీసరుగా అపాయిమెంటు వచ్చింది. ట్రెయినింగు పూర్తి కాగానే ఇక్కడ బాంకులో ఆఫీసరుగా వేశారు.

ఎలా ఈగండం తప్పించుకోవాలా అనుకొంటూ ఆలోచనలోపడ్డ అనిల్‌కుమార్ చీకటిపడడడం, తనూ చీకట్లో కూర్చుని ఉండడం గమనించి, గదిలో లైటువేశాడు. తరువాత ముఖం కడుక్కొని బట్టలు మార్చుకొని మెస్సుకు బయలుదేరాడు. మెస్సు నుంచి అటే సెకండ్ షో సినిమాకు పోవాలని అతని నిర్ణయం.

అనిల్‌కుమార్ సెకండ్ షో సినిమా చూసి గదిని చేరుకునే సరికి ఒంటిగంట అయింది. బైట లైటు స్విచ్ నొక్కాడు. లైటు వెలగలేదు. ఏమిటా అని పెన్ టార్చివేసి చూస్తే దానికి బల్బు లేదు. "చాలా విచిత్రంగా ఉందే, ఇలా ఎప్పుడూ జరగలేదు"అనుకొంటూ తాళంతీశాడు. గది లోపలకి రెండడుగులు వేసి స్విచ్ నొక్కడానికి చేయెత్తాడు. అంతలో వెనక నుంచి ఒక ఆకారం అతన్ని బలంగా పట్టుకొంది. ఆ ఆకారమే స్విచ్ దగ్గరున్న అతని చేతిని లాగేసింది. అనిల్‌కుమార్ తనేదో గొప్ప ప్రమాదంలో చిక్కుకొన్నట్లు గ్రహించాడు.

"ఎవరు నువ్వు?" వణకుతున్న కంఠంతో అన్నాడు.

ఆ అదృశ్య వ్యక్తి అనిల్‌కుమార్‌ని వదలకుండానే ఒక చేతితో గది తలుపు దగ్గరకు లాగి గడియవేసింది. తరువాత అదే

చేతితో స్విచ్ నొక్కింది మెర్క్యూరీ లైటు కాంతిలో తనను పట్టు కున్న వ్యక్తిని చూడగానే కెవ్వున కేకవేసి దూరంగా జరిగాడు అనిల్‌కుమార్. తనను యమలోకంలో భటులు మంటల్లోకి నెట్టి నట్లు గిలగిలలాడిపోయాడు. ఇంతకీ ఆ ఆకారం ఒక ఇరవై ఏళ్ళ సుందరాంగి.

ఎర్రని శరీరచ్ఛాయతో సన్నగా పొడవుగా నాజూగ్గా ఉంది. విశాలమైన కనుబొమలు. చేపల్లాంటి కళ్ళు కళ్ళకు కాటుక పెట్టి ఉంది. పెదిమలకు లిప్‌స్టిక్ వేసి ఉంది. ఆమె ధరిం చిన విలువైన వస్త్రాలు ఆమె అందానికి హుందాతనాన్ని తెచ్చాయి తనను కౌగిలించుకున్నది ఒక స్త్రీఅని తెలియగానే అతనిలో తెలియని వణుకు, చలిజ్వరం ప్రారంభమయ్యాయి.

"ప్లీజ్! నన్ను వదలండి" అన్నాడు విదిలించి. ఆమె కొద్ది దూరంలో ఉన్న అనిల్‌కుమార్ బెడ్‌మీద వయ్యారంగా పడు కొంది. అతను తలుపులు తీయబోయాడు.

"ఆగండి! నేను చెప్పబోయేది పూర్తిగా విని తరువాత ఏవ నయినా చేయండి" అంది అర్థిస్తున్నట్లు. ఇదెక్కడి ఖర్మరా బాబూ అనుకొన్నాడు. తనెవరు? ఆమె ఎవరు? ఇంత అర్ధరాత్రిపూట ఆమె చెప్పేది, తను వినేది ఏముంది?

"మీరెవరో ముందు చెప్పండి.?" అడిగాడు తలుపులుతీసే ప్రయత్నం విరమించి.

"అదే చెప్తున్నాను. మీరలా కూర్చోండి!" అంటూ కుర్చీ చూపించింది.

అనిల్‌కుమార్ అందులో కూర్చొన్నాడు.

"మాది అండర్ బ్రిడ్జి ఇవతల రోడ్డునే అనుకుఉన్న మూడవ మేడ - గోపీరంగుది. పైన భగవాన్ విలాస్ అని వ్రాసి ఉంటుంది. మీకు తెలుసుకదా....." అంది.

గొర్రెల మంద మధ్యలో నిలబెట్టిన గున్న ఏనుగులా ఆ ఏరియాలో ఉన్న భవనాల్లోకెల్లా కొట్టవచ్చినట్లు కనుపిస్తుంది ఆ భవనం. అనిల్‌కుమార్ వెళ్లేదారి అదేగనుక రోజూ చూస్తుంటాడు.

"నా పేరు యూన్సీ. మాకు ఆస్తి పాస్తులు లెక్కలేనంత ఉన్నాయి. నాలుగు బస్సులు, ఏడు లారీలు, మూడు కార్లు ఉన్నాయి. ఒకటి ఇంపాలా, మరొకటి ప్రీమియర్. ఇంకొకటి టయోటా. నేను టయోటా కారులోనే కాలేజికి వెడుతుంటాను. అదంటే నాకు చాల ఇష్టం"

చెప్పడం అపి వయ్యారంగా కదిలింది. మన్మధ బాణా ల్లాంటి చూపుల్ని గాలిలో విసిరింది. అనిల్‌కుమార్ తల దించు కొన్నాడు భరించలేక. ఇన్నిఉన్నా ఈమనిషికి వచ్చిన కష్ట మేమిటో, అన్నీ ఉండడంకూడా ఒకరకమయిన ఇబ్బందేమో! అనుకున్నాడు.

''అన్ని సౌఖ్యాలూ అనుభవిస్తున్న నన్ను ఏదో లోపం బాధించేది. అది ఇదని తేలిసేదిగాదు. ఈ మధ్యనే మిమ్మల్ని చూసిన తర్వాత తెలిసింది నే నుండేది ఒక బంగారు పంజరం లోనని. అందులో బంధింపబడ్డానని. మీలాంటి అందగాడికి భార్యను కావాలని, మీ కౌగిలిలో తనివితీరా కరిగిపోవాలని కలలు కనే దాన్ని"

"అది ముమ్మాటికీ జరగదు" ఖచ్చితంగా చెప్పాడు అనిల్ కుమార్.

"అవును. మీలాంటి బీదవారికి నేను ప్రేమించినంతమా త్రాన ఇచ్చి పెళ్ళిచేస్తారా? మా అంతస్తు ఎక్కడ? మీ అంతస్తెక్కడ? మీకు మహా ఉంటే లక్ష లుండొచ్చు. కాని మా ఆస్తి కోట్లతో ఉంటుంది.''

చెప్పడం ఆపి చిరునవ్వు నవ్వింది. అలా నవ్వినపుడు ఆమె పెదవులు వంకర్లు తిరిగాయి. "అలవిగాని ఆస్తి ఉంటే మనుషులు ఇలాగే ఉంటారు. కౌగిలిలో కరిగిపోవాలట. ధనం ఎక్కువయ్యే సరికి పైత్యపు కోరికలు పుడతాయి కాబోలు. ఒక వైపు తిండికి గతిలేక కడుపు మాడ్చుకొనే బీదలు, ఇంకోవైపు లెక్కలేనంత ఆస్తితో విర్రవీగే ధనవంతులు. ఈమె తనను చాలా ఇన్సల్టు చేస్తూ ఉంది. ఎలాగయినా ఈ రాక్షసిని వదిలించుకోవాలి అనుకొన్నాడు.

"డబ్బున్నంతమాత్రాన నాకు గర్వం లేదండీ. చూడండి, ఇంత విలువైన డ్రస్సంటే నాకేమాత్రమూ ఇష్టం లేదు, అందరిలా సింపుల్‌గా ఉండాలని నాకోరిక. కాని మావాళ్ళు వూరుకోరే. అంతస్తట అంతస్తు. నన్ను బొమ్మని చేసి అలంకరిస్తారు" అంటూ మంచం దిగి నిలబడింది.

అనిల్‌కుమార్ రెండుచేతుల్లో గడ్డం ఆన్చుకొని వూ కొడుతున్నాడు.

అతను వూహించనిపనిచేసింది ఝాన్సీ. శరీరంమీద ఒక్కో బట్టా విప్పేయడం మొదలుపెట్టింది. అనిల్‌కుమార్ కళ్ళు గట్టిగా మూసుకుని "వెళ్ళిపో. వెళ్ళిపో ఇక్కడ్నుంచి" అంటూ అరవసాగాడు.

కాని ఆమె అదేమీ పట్టించుకోకుండా బెడ్‌మీద పడుకొని "ఏమండీ! నాకింత విలువైన బట్టలమీద అయిష్టం అంటే మీరు ఆశ్చర్యపోయి ఉండవచ్చు. కాని నిజానికి నన్ను చూడండి. మీ అభిప్రాయం మారుతుంది" అంది.

అనిల్‌కుమార్ అయిష్టంగానే కళ్లు విప్పి వ్రేళ్ళ సందుల్లోంచి చూశాడు. ఆయువతి ఛాతీమీద తన్నుకొస్తున్న కుచద్వయాన్ని నైట్ క్వీన్ బ్రా లాగి పట్టుకొని ఉంది. దాంతర్వాత

శరీరంమీద ఎల్లో కలర్ లంగామాత్రమే ఉంది. లంగాకు, బ్రాకు మధ్యఉన్న ఖాళీస్థలం సూర్యాస్తమయ సమయంలో భూమిని ఆకాశాన్ని కలుపుతూ మధ్య ఏర్పడిన సంధ్యాసమయంలా ఉంది.

సహజమైన ఎత్తు పల్లాలతో పుష్కలమైన శరీర సౌష్ఠవం కలిగిన ఆ అమ్మాయిని చూడగానే అతని శరీరం అంతరాంతరాలల్లో జీర్ణించుకొనిఉన్న ప్రకృతిసిద్ధమయిన ఏదోకోరిక అతనిలో జొరబడి ఏమీ తోచనీయకుండా చేసింది.

ఇంతలో ఝాన్సీ లేచివచ్చి నుతారంగా అనిల్‌కుమార్ చేతులు పట్టుకులేపింది. పిల్లిలా ఆమె వెంట నడిచాడు. ఆమె నడుస్తూ అంది.

"నేను ఎన్నాళ్లగానో మీమీద మనసుపడి ఉన్నాను. మీ అందం నన్ను వెర్రెత్తించింది. పెళ్ళి ఎలాగూ కాదు. ఒక్క రోజయినా మీ భార్యగా గడిపాలనే కోరికతో రహస్యంగా మేడ దిగి ఇలా వచ్చాను. గూర్ఖా తూగుతూ ఉండడం నాకెంతో ఉపకరించింది."

అనిల్‌కుమార్ ఇప్పుడు ఆమె బానిస. ఆమె చేతిలో మైనం ముద్ద అయ్యాడు. గంట తర్వాత అతను దేనికయితే దూరంగా ఉన్నాడో దాన్ని ఆదినుండి అంత్యం వరకూ తెలుసుకొన్నాడు.

సాలోచనగా ఆమెవైపు చూశాడు ఇంకా వెళ్లలేదేమిటా అని. ఆమె అస్తవ్యస్తంగాపడి నిద్రపోతూ ఉంది. అనుభవం తాలూకు సుఖం ఆమె ముఖంలో స్పష్టంగా కనిపిస్తూ ఉంది. ఆమె అంత తేలిగ్గా వెళ్లేట్టులేదు. అనిల్‌కుమార్‌కి ఏంతోచలేదు. తెల్లవారితో తన పరువు గంగలో కలిసిపోతుంది ఆ అమ్మాయిని తట్టి లేపుదామంటే మనసు ఒప్పుకోవడంలేదు కోటీశ్వరులయిన

ఆమె తల్లి దండ్రులకు ఈసంగతి తెలిసిందంటే ముందు వెనుకలు ఆలోచించకుండా తను చేసిన పనికి ఆజన్మ ఖైదు వేయిస్తారు.

అతను ఆలోచనలతో సతమతమవుతూండగానే ఎవరోతలుపు తట్టిన శబ్దమయింది. అనిల్‌కుమార్ గుండె ఒక్కసారి ఆగి మరలా కొట్టుకోసాగింది. తనపరిస్థితి గుర్తొచ్చి "ఏంచేయాల్రా దేవుడా' అనుకున్నాడు. తలుపు చప్పుడు మరీ ఎక్కువయింది. అనిల్‌కుమార్ అస్తవ్యస్తంగా ఉన్న ఆమె బట్టలు సరిజేసి, ఆమె కనిపించకుండా పూర్తిగా బ్లాంకెట్ కప్పేశాడు.

తల దువ్వుకొని, బట్టలు సరిచేసుకొని వెళ్ళి తలుపు తీశాడు. అరవైఏళ్ళ వ్యక్తి లోపలికి దూసుకొని వచ్చాడు. నెత్తిన టోపీ, వైంటు పాంటు, వైటుషర్టు, నల్లనికోటు ధరించి ఉన్నాడు. లావుపాటి మీసాలు మెలితిరిగి ఉన్నాయి. కుడిచేతిలో హాండ్ స్టిక్, మణికట్టుమీద వ్రేలాడుతూ రెండుపేటల బంగారు చెయిను. మెడలో కనిపించీ కనిపించకుండా మరో బంగారు చెయిను. చూడగానే కొంత అర్థమయింది. అర్థం కాగానే భయం మొదలయ్యింది.

"బాబూ! ఇటు కేసి ఎవరైనా పాపవచ్చిందా" అడిగాడు ఆగంతకుడు.

అనిల్‌కుమార్ గొంతు తడారిపోగా ఏం మాట్లాడలేక పోయాడు.

మళ్ళీ అతనే అందుకున్నాడు." బాబూ నాపేరు భగవాన్ దాస్. మన వీధి మొదట్లోఉన్న గోపీరంగు మేడ భగవాన్‌విలాస్‌లోనే నుండేది. ఒక అరగంట క్రితం నేను రూములోకి వెళ్ళి చూస్తే మా పాప రూమ్సి లేదు. నేనూ, నాభార్యా భయపడిపోయాము. ఇల్లంతా వెతికాము. కనుపించలేదు. అర్ధరాత్రి సమయంలో స్నేహితుల దగ్గరకు ఎందుకుపోతుంది అనుకున్నాము. మాపూర్వ

కును జమీందార్లు, బాబూ! పరువుపోతుందని నౌకర్లకికూడా తెలియకుండా నేనూ మా అబ్బాయి నిరంజనదాసూ ఇలా తిరుగుతున్నాం. ఆ గూర్ఖాగాడు మేము వచ్చేదికూడా గమనించకుండా పడి నిద్ర పోతున్నాడు. సగం గేటు తెరుచుకొని ఉంది. వాడే మేలుకుని ఉంటే ఈ అనర్థం జరిగేదికాదు. కిటికీ లోంచి కనపడే లైటు చూసి నీదగ్గరేమయినా సమాచారందొరుకుతుందని వచ్చాము." మునలాయన కోటు జేబులోంచి ఖరీదైన చేతిగుడ్డ తీసి ముఖం తుడుచుకున్నాడు.

ఇంతలో ఒక పాతికేళ్ళ యువకుడు పరుగెత్తుకుంటూ వచ్చాడు. "నాన్నగారూ! పాప ఎక్కడా కనిపించలేదు. నా మనస్సేదో కీడు శంకిస్తూ ఉంది" అంటూ అనిల్‌కుమార్‌వైపు అనుమానంగా చూశాడు.

ఆ యువకుడు ధరించిన విలువైన వస్త్రాలు జమీందారు. హెూదాను తెలియజేస్తున్నాయి. అతను ఎత్తుగా, ధృఢంగా ఉన్నాడు.

అనిల్‌కుమార్ గొంతు తడారిపోయి, ఎక్కిళ్లు కూడా ప్రారంభమాయ్యాయి. భూమి గుండ్రంగా తన నెత్తినే స్పీడుగా తిరుగుతున్నట్లు అనిపించింది. తను ప్రమాదానికి చివరి అంచున నిలబడి ఉన్నాడు. జమీందారు వంశీయులతో తమాషానా!

ఇంతలో భగవాన్‌దాస్ అన్నాడు. "బాబూ! ముసలివాణ్ని. తిరిగి తిరిగీ అలసిపోయాను. కాస్త ఆ చేత్తో ఒక గ్లాసు నీళ్ళిస్తావా!" నీరసంగా అడిగాడు.

అనిల్‌కుమార్ గ్లాసులోకి నీళ్లు నింపి తీసుకువచ్చేసరికి భగవాన్‌దాసూ, అతనికొడుకూ చెరి ఒక కుర్చీలో కూర్చుని ఉన్నారు.

నీళ్ళు తాగి గ్లాసు కింద పెడుతూ— "మంచంమీదపడుకుని ఉన్నది ఎవరు బాబూ!" అనడిగాడు అనిల్‌కుమార్‌ని.

"నా రూమ్‌మేటు, సార్!"

"అలాగా! కొద్దిగా లేపండి మాట్లాడుదాం."

"పాపం అతనికి రెండు రోజుల నుంచి మంచి నిద్ర లేదు సార్! లేవగొట్టొద్దని నాకు ముందుగా చెప్పాడు" అనిల్‌కుమార్ గుండె వేగంగా కొట్టుకోసాగింది.

"ఏం ఫరవాలేదు. విషయం చెబితే ఏమనుకోడులే. బాబూ"

"ఆయామ్, సారీ, సార్! ఎట్టి పరిస్థితిల్లోనూ లేపొద్దని ఖచ్చితంగా చెప్పాడు. లేపడం బాగుండదు."

"ఎందుకండీ అట్లా భయపడిపోతారు. మిమ్మల్నేమయినా అంటాడనా. మిమ్మల్నంటే మేమూరుకొంటామా! తోలు వలిచేయమూ" అన్నాడు నిరంజనదాసు కోపంగా.

"ఎందుకండీ అంత ఆవేశపడతారు. అబ్బాయిగారూ! బాబూ అబ్బాయిగారు చెల్లెలు కనుపించని దుఃఖంలో ఏదేదో అంటున్నారు. మీరదేమీ పట్టించుకోకండి. మీ ఫ్రెండుని లేపండి. ఫరవాలేదు".

అనిల్‌కుమార్‌కు జరుగబోయే పరిణామాలేమీ అర్థం కావడంలేదు. మునలాయన మాటల్ని ఖాతరుచేయక, మొండి ధైర్యంతో గంభీరంగా నిలబడి ఉన్నాడు.

రెండు నిమిషాలు చూసి భగవాన్‌దాస్ కుమారుడు నిరంజన్‌దాస్ మంచాన్ని సమీపించి "ఏమిండీ కొద్దిగా లేస్తారా మీతో మాట్లాడాలి." గట్టిగా పిలిచాడు.

రూప్సీ నిద్రలో మత్తుగా మూలిగింది.

అనిల్‌కుమార్ కళ్లప్పగించి చూస్తున్నాడు. జరగబోయే ప్రమాదాన్ని వూహించుకుంటూ ఉంటే భయంగా ఉంది. రక్తం చల్లబడిపోయింది. గుండె గొంతులో కొట్టుకోసాగింది. జరగబోయే దాని ఫలితం, తరువాత తన భవిష్యత్తు గుర్తుకు రాసాగాయి.

నిరంజన్‌దాస్ పిలవడం, లోపల నుంచి మత్తుగా మూల గడం, అటూ ఇటూ దొర్లడం తప్ప దుప్పటి తొలగలేదు. దాంతో వళ్ళు మండిన నిరంజన్‌దాస్ దుప్పటి పూర్తిగా లాగి పారేశాడు. బ్రా, లంగాతో అర్ధనగ్నంగా ఉన్న చెల్లెల్ని చూసేసరికి అతని గుండె మండింది. కళ్ళు రెండూ గట్టిగా మూసుకున్నాడు. భగ వాన్‌దాస్ ముఖం వెలవెలా పోయింది. ఏ క్షణంలో మూర్ఛ బోతాడా అన్నట్లున్నాడు.

"ఝాన్సీ" కళ్ళమీదనుంచి చేతులుతీసి అరిచాడు. అతని ముఖం కందగడ్డలా అయింది. భగవాన్‌దాస్ పరుగెత్తుకుంటూ వచ్చి కుమారుడి నోరు మూశాడు. "బిగ్గరగా అరవకండి నిరంజన దాస్‌గారూ! మనపరువుపోతుంది. మీరు మాట్లాడకండి. అన్నీ నేను చూసుకుంటాను. గది తలుపులు కిటికీలు అన్నీ మూసి ఉన్నాయో, లేదో చూసి రండి" అని ఆదేశించాడు.

గావు కేకకు కళ్ళు తెరిచిన ఝాన్సీ రెండు పులుల మధ్య మేక పిల్లలా మంచందిగి నిలబడి సన్నగావణకసాగింది. దుప్పటి వళ్లంతా కప్పేలాగ మెడచుట్టూ చుట్టుకుని రెండుచేతులు ముడుచుకుని ఒకవారగా నిలబడింది.

"ఏమిటయ్యా, ఈపని దుప్పటిలో ఎవరు పడుకుని ఉన్నారూ అంటే స్నేహితుడన్నావ్, లేపొద్దన్నా డన్నావ్. తీరా అందులో చూస్తే ఎవరున్నారు! నా బంగారు కూతురు."

"ఏం చేశావ్ మాచెల్లెలిగార్ని. చెప్పుముందు. నీబెడ్‌మీదికి ఎలా వచ్చి పడుకొంది'' ఉరిమాడు నిరంజన్‌దాస్.

"నాకేం తెలియదు. అమే వచ్చి పడుకుంది''

"ఏమిటి నాచెల్లెలుగారా! అటువంటిది కానేకాదు. ఏమ్మా" అన్నాడు అమె వైపు చూసి.

అమె గజగజ వణకుతూ అంది "అన్నయ్యగారూ! నాకేం తెలియదండి. నేను నాగది వరండాలో చదువుకుంటున్నాను. కొద్ది సేపటికి ఎందుకో బోర్‌కొట్టింది పరీక్షలు దగ్గరకువచ్చాయి కదా. ఇంకొద్ది సేపు మేలుకుని ఉండాలని ఫ్లాస్కులోంచి టీ వంచుకుని కొద్దిగా తాగాను. కొద్దిసేపు అలా తిరుగుదామని కిందికి వచ్చాను. గూర్ఖా నిద్రపోతున్నాడు''

"అవును. వాడొట్టి దద్దమ్మ. తల్లీ! వాడ్ని సస్పెండు చేసి రేపే ఇంకొకడ్ని పెడతాను. తరువాత ఏం జరిగింది తల్లీ?" భగవాన్‌దాస్ ఆతృతగా అడిగాడు.

''అదే. వాడు నిద్రపోతున్న విషయం ఋజువు చెయ్యాలని, స్టూలు పక్కనే పడివున్న తాళాల తీసుకుని మెయిన్‌గేటు నుంచి బయటకు వచ్చాను. అంటే నాఉద్దేశ్యం గేటు అవతల నుంచి గూర్ఖాను లేపితే అతను డ్యూటీ ఎంతమాత్రం చేస్తున్నాడ నేది అతను ప్రాక్టికల్‌గా తెలుసుకుంటాడని.''

"'అయ్యో! నాచెల్లెలుగారికి ఎంత తెలివి. జమిందారీ వంశీయులంటే మాటలా! తరువాత ఏం జరిగిందమ్మా."

"అలా వీధిలోకి వచ్చి మెయిన్‌గేటు తలుపులు దగ్గరకు వేశాను. బయటనుంచి ఇక గూర్ఖాను పిలుద్దామనుకుంటున్నాను. ఇంతలో చీకట్లో కనిపించకుండా గోడచాటున ఆగివున్న రిక్షా నాపక్కనొచ్చి ఆగింది. నేను భయపడి అరిచాను. రిక్షాలోంచి

ఈ పెద్దమనిషి దూకి శబ్దం బయటకు రాకుండా నానోరు మూశాడు. తరువాత రిక్షావాడి సాయంతో నన్నిక్కడకు తీసుకొచ్చిపడేయడం జరిగిపోయింది".

భగవాన్‌దాస్ చిన్నగా రోదించాడు. ''అమ్మా! నీకెన్ని బాధలు వచ్చాయి ఈవిషయం ఎవరికయినా తెలిస్తే మన స్టేటస్ మన గౌరవం ఏమయిపోతాయమ్మా. ఎవరికీ తెలియనీయకుండా నిన్ను వెదుక్కుంటూ నేనూ, అనయ్యగారు ఇలా వచ్చామమ్మా.''

"యూ ఇడియట్!'' ఆగ్రహావేశాలతో పిడికిలి బిగించి ముందుకువచ్చిన కుమారుడ్ని ఆగమన్నట్లు చేయెత్తి వారించాడు. భగవాన్‌దాస్. తరతరాలుగా తండ్రి మాట జవదాటని కుటుంబం కావడంతో నిరంజన్‌దాస్ ఆగిపోయాడు. జరిగిన అవమానానికి అతని గుండె ఎగసి ఎగసి పడుతూ ఉంది.

''తల్లీ! ఇంకేవయినా జరగకూడనివి జరిగాయా" దగ్గరకు వెళ్ళి తలనిమురుతూ అడిగాడు భగవాన్‌దాస్.

''అవునునాన్నగారూ! అంతా అయిపోయింది. ఇక నాజీవితం వ్యర్థం. మీ వంశానికి అప్రతిష్ట తెచ్చిన నేను బతకూడదు. ఇప్పుడే ఈక్షణమే విషం తాగి మరణిస్తాను. మీకు అపకీర్తి రాకూడదు. గుప్పెడు విషం కాఫీలో కలిపి ఇవ్వండి. సడన్‌గా ఏదో జబ్బుచేసి చనిపోయిందని లోకానికి తెలియజేయండి, అంతే కాని నన్ను క్షమించకండి." ఝాన్సీ తండ్రి కాళ్ళమీదపడి ఏడ్చింది.

ముసలాయన విషయం వింటూనే స్పృహ తప్పి నేలకు ఒరిగి పోయాడు. కొడుకు శుశ్రూషకు కళ్ళు తెరిచాడు. తరువాత నెత్తీనోరు కొట్టుకున్నాడు. గుండె బాదుకున్నాడు. ఎప్పుడు సుఖాలలో తేలియాడె కోటీశ్వరుడి ఇప్పటి పరిస్థితి జాలి కలిగించక మానదు. పక్కనేఉన్న నిరంజనదాసు తేరుకుని బెల్టు వూడదీసి

కుడిచేతిలో బిగించి పట్టుకున్నాడు. అది పాముల వాడిచేతిలోని పాములా వేలాడుతూ వదిలితే కరవడానికి సిద్ధంగా ఉన్నట్లుంది. తండ్రి ఆజ్ఞ కోసం ఎదురు చూడసాగాడు.

భగవాన్‌దాస్ దృష్టి దీని కంతటికీ కారణమయిన అనిల్ కుమార్ వైపు మళ్ళింది. "ఓరి దుర్మార్గుడా! ఇంతపని చేయడానికి నీ కెన్ని గుండెల్రా! ఇప్పటివరకూ నీవు మంచివాడివనే అనుకున్నాను. నాపేరంటే ఈ ఆంధ్రాఅంతా తెలుసు. ఈ ప్రాంతంలో ఇంత ఆస్తిపరుడులేడు. అటువంటిది నాఏకైక కూతురుని చెరచడానికి నీకెన్ని గుండెల్రా?" కోపం ఎక్కువై పళ్ళు కొరకసాగాడు.

"నాన్నగారూ! నాకు అనుమతి ఇవ్వండి. వాడి చర్మం వలిచేస్తాను." మాటలు చిన్నవిగాఉన్నా వాటిలో కాల్చివేసే వేడి ఉంది.

అనిల్‌కుమార్ శూన్యంలోకి చూస్తున్నాడు. తిని కొవ్వెక్కి కామంతో కళ్ళు కనపడని ఆడది ఏది మంచో, ఏది చెడో గమనించకుండా కనపడ్డ వాడితో కామదాహం తీర్చుకుంది. ఆడది ఎప్పుడూ అవకాశవాది. పరిస్థితులు తారుమారు అయ్యేసరికి తప్పంతా తనమీద నెట్టేసింది. ఆడదాన్నినమ్మకూడదని ఇప్పుడు మరోసారి తెలిసింది. గదిలోకి రాగానే పోలీసు రిపోర్టు ఇచ్చి ఉండవలసింది అనుకున్నాడు. ఈ సంఘటనతో రెచ్చిపోయాడు. కోపాన్ని మనసులోనే అణుచుకున్నాడు.

"'ఏమయ్యా పెద్దమనిషి పలకవ్" అన్నాడు భగవాన్‌దాస్.

"నేనేం చెప్పేదండీ. ఆ అమ్మాయి చెప్పేదంతా అబద్ధం. అ అమ్మాయి తనకై తాను నా రూముకు వచ్చిందంటే నమ్మరే.''

"నాన్నగారూ! అన్నయ్యగారూ! నన్ను నమ్మండి. నేను చెప్పేది నిజం'' బోరున ఏడుస్తూ అంది అంది యూస్సీ. ఆమె ముఖం నిష్కల్మషంగా అద్దాన్ని నీటితో కడిగినట్లుంది.

"ఇదిగో అబ్బాయ్! నేను చెప్పేది విను. పోలీసు రిపోర్టు ఇస్తే నీకు పడబోయే శిక్షేమిటో తెలుసా. లైఫ్. ఐ. పి. సి. మూడు వందలా డబ్బైఐదవ సెక్షను ప్రకారం నీకు లైఫ్ పడుతుంది లేదంటే పదేళ్ళకు తగ్గదు జైలు.''

అనిల్‌కుమార్ పళ్ళు కొరికాడు ముందు ఝాన్సీ తరువాత తండ్రి కొడుకుల్ని నాలుగు తన్ని తరమాలన్నంత కోపం వచ్చింది.

''మీరూరుకోండి, నాన్నగారూ, వెళ్ళి పోలీసులకు ఫోన్ జేస్తాను."

"త్వరపడి అలా చేయకండి. అబ్బాయిగారూ, పోలీసులకు ఫోను చెయ్యడం గొప్ప విషయం అని అనుకోకండి. తరువాత మన పరిస్థితి ఎలా ఉంటుందో ఆలోచించండి. అమ్మాయిగారిని వివాహం చేసుకోవడానికి ఇక ఏపిల్ల జమీందారూ ముందుకు రాడు."

దీర్ఘాలోచనలో పడిపోయాడు నిరంజనదాసు. "అయితే ఇతన్ని వదిలెయ్యడమేనా, దానికి నే నొప్పుకోను. వీడి అంతు తేల్చేస్తాను."

"అదే నేనూ ఆలోచిస్తున్నాను. అటు మన పరువుపోకుండా తగిన శాస్తి చేయాలి." తిడుతూనే ఉన్నాడు. సమయం గడిచిపో సాగింది.

"వీడ్నిసఫాచేస్తాను." ఆఖరుగా అన్నాడు నిరంజనదాసు.

ఈమాట వినేసరికి అనిల్‌కుమార్‌లో పౌరుషం కోడిపుంజు తల నిగిడినట్లు నిగిడింది. విజయమో, వీరమరణమో, తప్పు తనది కానప్పుడు వీళ్లకెందుకు భయపడాలి అనుకొన్నాడు. అన్నింటికి తెగించి తనూ యుద్ధానికి సిద్ధమయ్యాడు.

"ఏమిటీ? చంపుతా నంటరా? అది మన ఇంటా, వంటా లేదు. మనది సూర్య వంశానికి చెందిన కుటుంబం. నిరంతరం దానాలుచేస్తూ ఎన్నో జీవితాలను కాపాడిన చేతులు మనవి. వాటితో అప్రదిష్టపు పనులుచేయకండి." అరిచాడు భగవాన్‌దాసు.

తరువాత కొడుకుని తీసుకొని బయటికి వెళ్ళాడు. అనిల్ కుమార్ అప్పటివరకూ క్రొత్త కథ వినిపించిన యూన్సీ వైపు ఉరిమి చూశాడు. ఏడుపు ముఖం పెట్టిన యూన్సీ, తన తండ్రి. అన్నయ్య అలా బయటికి వెళ్ళగానే అనిల్‌కుమార్ వైపు చూసి గాలిలో వో ముద్దు విసిరి కొంటెగా చూసింది. ఒళ్ళు భగ్గున పడింది అనిల్ కుమార్‌కు.

"మీరీ ప్రమాదంలోంచి బయటపడాలంటే మార్గం నేను చెబుతాను" అంది యూన్సీ చిన్నగా.

"ఏమిటి?" అడిగాడు గత్యంతరం లేక.

"ఇది జరిగిన తర్వాత మనఇద్దరికి పెళ్ళిచేస్తారనుకొన్నాను. కాని, మావాళ్లు ఒప్పుకొనేట్లు లేరు. మనకు అంతస్తులు అడ్డు వస్తున్నాయి కనుక మావాళ్ళు వంశ ప్రతిష్టలు నాశనమవుతాయని భయపడుతున్నారు."

"అయితే!"

"ఇంకొక మార్గముంది. మా నాన్నగారికి డబ్బు పిచ్చి ఎక్కువ. మీరో పాతికవేలు మా నాన్నగారికి ఇస్తానని చెబితే ఈవిషయంలో క్షమించవచ్చు. మానాన్నగారిమాటే మాఅన్నయ్య గారికి వేదవాక్కు. కనుక దీనికి వప్పుకుని వదలిపెట్టవచ్చు."

అనిల్‌కుమార్‌కు అంత బాధలోనూ నవ్వు వచ్చింది. వంశ ప్రతిష్టలుట. వంశప్రతిష్టలు కోసం తమ సర్వాన్ని త్యాగంచేసిపిర

మరణం చెందినవాళ్ళు, బికారులయినవాళ్ళు ఉన్నారు. కాని ఇలా డబ్బు కోసం వంశ ప్రతిష్ఠలు పోగొట్టుకొనే వాళ్ళు లేరు. తనదగ్గర డబ్బెక్కడిది. ఈడ్చి తన్నినా ఈనెల జీతం తప్ప మరేమీ లేదు. అయినా వాళ్ళకు తనెందుకు డబ్బివ్వాలి?

ఈ లోపల తలుపులు తీసుకొని తండ్రీ, కొడుకులు లోపల ప్రవేశించారు.

"నేను మీ అమ్మాయిని పెళ్ళిచేసుకోదలిచాను." వాళ్ళేదో అనబోయే లోపల అనిల్‌కుమార్ అన్నాడు. అతనికి కల్లాకపటం తెలియని ఒక అమ్మాయి శీలం దోచేశానే అనే పశ్చాత్తాపం ఒక వైపు వుంది.

దాంతో వాళ్ళొక్కసారిగా ఉలికిపడ్డారు. ఝాన్సీ కళ్ళు ఆనందంతో మెరిశాయి. ఝాన్సీవైపు ప్రశాంతంగా చూసిన వాళ్ళ కళ్ళు క్షణంలో రంగులు మారాయి.

"హు!....మేమెవర మనుకొన్నావు. నీతో మాకు వియ్యమా? నక్కకూ, నాగలోకానికి ఎంత తేడా! ఎక్కడైనా చీమలు, సింహాలతో స్నేహం చెయ్యడం చూశావా! మేము నలుగురిలో తలెత్తుకొని తిరగాలనే నువ్వీమాటంటున్నది. పరాభవాగ్నితో ఇప్పటికే దహించుకుపోతున్న మాతో పరచికాలాడుతావా?" హుంకరిచాడు భగవాన్‌దాసు.

అనిల్‌కుమార్ మవునంగా ఉండిపోయాడు.

"ఇప్పుడు మేము ఏం నిర్ణయించుకొన్నామో తెలుసా. పోలీసు రిపోర్టు ఇవ్వాలని. మా సంగతి బయటకు రాకుండా నిన్ను లోపల తోసెయ్యాలని." నిరంజన్‌దాసు గద్దించాడు.

పోలీసు రిపోర్టు ఇస్తే సహజంగా తప్పు తనదేనని తెలుస్తుంది. తనకు తప్పక జైలు శిక్ష పడుతుంది. దాంతో ఉద్యోగం

పోతుంది. ఇక ఆలోచిస్తే లాభంలేదు. ఝాన్సీ చెప్పిన రెండో ఉపాయం ప్రయోగించి చూడాలి అనుకున్నాడు.

"జరిగిందేదో పొరపాటు. తప్పు నాదే కనక ఎంతో కొంత డబ్బు తీసుకుని నన్ను వదలివేయండి." అన్నాడు అనిల్‌కుమార్ తలవంచుకుని.

"చేసిన నీచపుపనిని డబ్బుతోలెక్క గడుతావా, దుర్మార్గుడా" హూంకరిస్తూ మీదిమీదికి రాబోతున్న నిరంజన్‌దాసును ఆపాడు భగవాన్‌దాసు.

"మీరూరుకోండి అబ్బాయిగారూ! ఉభయులకూ శ్రేయస్కరమైన పని మన మాలోచించాలి. ఇంతకీ ఎం తిస్తానంటావ్" అన్నాడు డబ్బు మనిషి భగవాన్‌దాసు. అతని కళ్ళు మిలమిలా మెరుస్తున్నాయి.

డబ్బు విషయంలో తండ్రి వీక్‌నెస్‌కు కోపం వచ్చినా, తండ్రికి ఎదురుచెప్పలేక అసహ్యంగా అటు తిరిగి నిలబడ్డాడు.

"అయిదు వేల రూపాయ లివ్వగలను."

"అయిదు వేలేమిటి. పాతిక వేలయినా ఇవ్వందే ఈ కేసు డ్రాప్ చేసుకోను."

ఇద్దరికీ వాదోపవాదం పెరిగింది. అనిల్‌కుమార్‌కి ఇది ఇష్టం లేకపోయినా ప్రమాదంలోంచి తప్పించుకోవడంకోసం దేనికైనా సిద్ధంగా ఉన్నాడు.

అరగంట తర్వాత బేరం పది వేలకు తెగింది.

"నేను రెండు రోజుల్లో ఆ మొత్తం మీ ఇంటికి చేరుస్తాను. ప్రస్తుతం నాదగ్గర ఈనెల జీతం తప్ప మరేమీ లేదు."

"ఏమిటీ డబ్బు లేకుండానేనా. ఇంతసేపు బేరంచేసింది. ఏం పెద్దమనిషివయ్యా నువ్వు. ఈవిషయం బయటకు పొక్క

కూడదని ఎంత కప్పిపుచ్చినా నువ్వు నాదారికి రావడం లేదు" అన్నాడు కోపంగా.

అటు తిరిగి ఉన్న నిరంజనదాసు చివ్వున తల తిప్పాడు. ఏం మాట్లాడలేదు. పళ్ళు కొరికాడు. బెడ్‌మీద ఉన్న బ్లాంకెట్ కింద పరిచి గదిలో ఉన్న పది జతలు టెరీకాటన్ బట్టలు, రేడియో, ఆటోమెటిక్ ఐరను బాక్సు, టేప్‌రికార్డర్, అలారం టైంపీసు అందులో ఉంచాడు. టేబులు మీదున్న అనిల్‌కుమార్ ఎలక్ట్రానిక్ వాచ్ జేబులో వేసుకున్నాడు. లాక్‌చేయకుండా వదలిన బ్రీఫ్‌కేసు తెరిచి అందులోఉన్న రెండు వేలు జీతం జేబులో కుక్కుకున్నాడు.

వస్తువుల్ని దుప్పట్లో మూటగా కట్టి పట్టుకుని "నాన్న గారూ! నాలుగు కావచ్చింది. హొటళ్ళ వాళ్ళు లేస్తారు. మన పరువు పోతుంది వెళ్దాం పదండి" అంటూ ముందుకు నడిచాడు. వెనకనే భగవాన్‌దాసు, ఈలోపల చీరలో ముస్తాబయి ఉన్న ఝాన్సీ అతన్ని అనుసరించారు. అంత పెద్దభవనంలో ఏదో మూల నిద్రిస్తున్న వృద్ధ దంపతులకు ఈవిషయం తెలియదు.

వాళ్ళు రోడ్డున పోతున్న ఆటోని ఆపడం, అందులో అందరూ ఎక్కడం కిటికీలోంచిచూస్తున్న అనిల్‌కుమార్‌కు స్వప్నంలోంచి చూస్తున్నట్లుగా ఉంది. ఇది కల కాదు యథార్థం అని తెలియజేస్తూ సమీపంలోని స్టేషన్‌లోంచి రైలు బిగ్గరగా కూసింది.

అనిల్‌కుమార్ సుస్తీగా ఉందని బాంకుకు సెలవు పంపించి గదిలోనే ఉండిపోయాడు. పోయినవస్తువుల్ని ఇంట్లో వాళ్ళకు ఏ పద్ధతిలో తెలియజేయాల్నాఅని ఆలోచిస్తున్నాడు. మధ్యాహ్నం పన్నెండు గంటల సమయంలో పోస్టుమన్ ఒక కవరందించి వెళ్ళిపోయాడు. అది లోకల్‌గా పోస్టుచేయబడ్డ ఉత్తరం. ఫ్రం అడ్రసు లేదు. కవరు చించాడు.

"ప్రియమైన అనిల్‌కుమార్‌కు ఝాన్సీ నమస్కరించి వ్రాయడం."

మొదటి వాక్యానికే అనిల్‌కుమార్ వళ్లుమండింది 'రాస్కెల్ ఇంకా నన్ను వదలిపెట్టలేదు' అనుకుంటూ పళ్లు కొరుక్కున్నాడు.

"నా మీద మీకు చెప్పరాని అసహ్యం ఉంది కదూ. స్త్రీ జాతినే సమూలంగా నాశనం చేయాలనుకుంటున్నారు కదూ. రాత్రి మీకళ్ళలో కనబడ్డ కసీ, ముఖంలో కనిపించిన వేదన, శరీరం మీద నిక్కబొడుచుకున్న రోమాలు ఈవిషయం తెలియ జేశాయి.

నా కథ విని మీరు ఏనిర్ణయానికి వచ్చినా నాకంగీకారమే. నా దొక విషాద గాథ. మా నాన్నకు ఆరుగురం సంతానం. మా నాన్న బడిపంతులుగా నేను బి.ఎ., ఫైనలియరు చదువుతూండగా రిటయిరయ్యాడు. దాంతో నేను కాలేజీ మానేసి మా నాన్నకు తోడుగా ట్యూషన్లు చెప్పాల్సి వచ్చింది. తరువాత ప్రైవేటుగా బి. ఏ. ప్యాసయ్యాను. మరునటి సంవత్సరమే మా నాన్న చని పోయాడు. వృద్ధురాలైన తల్లి, పెళ్ళి కెదిగిన చెల్లెళ్ళు, చదువు కుంటున్న తమ్ముళ్ళకు నేనే ఆధారమయ్యాను. ఉద్యోగం కోసం ఎన్నో బాధలు పడ్డాను. ఎక్కడా దొరకలేదు. ఇంట్లో పరిస్థితి కటకట అయిపోయింది. కట్టుకోను సరియైన బట్టల్లేని నా చెల్లె ళ్ళను, కడుపునిండా తిండిలేని తమ్ముళ్ళను, నీరసంగా తూలి పోయే తల్లిని చూస్తూ ట్యూషన్లమీద వచ్చే డబ్బుతో ఒకపూట తిని ఇంకోపూట తినక పస్తులు గడుపుతున్న నాకు ఒకప్రైవేటు ఫర్మ్ మేనేజరుతో పరిచయమయ్యింది.

అతను ఒకరోజు ఉద్యోగమిస్తాను రమ్మన్నాడు. నమ్మి అతని గదికి వెళ్ళిన నన్ను అనుభవించి, వంద రూపాయలు

చేతిలో పెట్టాడు. ప్రస్తుతానికి ఉద్యోగంలేదని, ఏమైనా ఖాళీలొస్తే తప్పక నాకే ఇస్తానని, అప్పుడప్పుడూ తన రూముకు రావచ్చని వచ్చినప్పుడల్లా ఎంతో కొంత ఇస్తానని పలికాడు. నాకు పిచ్చిఎత్తి నట్లయింది. వంద రూపాయలనోటు వాడిముందే ముక్కలుచేసి, ఆ ముక్కల్ని వాడి ముఖాన్నే చల్లి, ఏడుస్తూ బయటికి పరుగెత్తాను. ఆ సాయంత్రం వరకూ ఏం తోచక, ఎడారిలో నీళ్ళ కొరకు వెతికినట్లు వూరంతా వెతికాను. ఆ సాయంత్రం హుసేన్ సాగర్‌లో దూకి ఆత్మహత్య చేసుకోబోతున్న నన్ను ఇద్దరు వ్యక్తులు పరుగెత్తుకువచ్చి పట్టుకొన్నారు. వాళ్ళని చూసి బావురుమన్నాను. వాళ్ళెవరోకాదు, నాక్లాసుమేట్సు నారాయణ, దేవదాసు. వాళ్ళకు విషయమంతా చెప్పాను. కాని ఆ దుర్మార్గుడి అడ్రసు ఇవ్వలేదు

"నేను శీలం పోగొట్టుకొన్న దాన్ని. ఎవరికోసం బ్రతకాలి" అన్నాను.

'నీకోసం, నీసోదర సోదరీమణులకోసం' అన్నారు వాళ్ళు.

వాళ్ళూ నిరుద్యోగులు. నాటకాల కంపెనీలోచేరి వేషాలు వేస్తున్నారట. నన్ను రమ్మన్నారు. ఆలోచించి సరే అన్నాను. కాని ఏంలాభం. అక్కడా కాంపిటీషను. సీజనులోనే డ్రామాలుంటాయి. అదీకాక నాలాంటి ఆడదానికి వాళ్ళ చేతుల్లో శీలం పోగొట్టుకోవల సిన పరిస్థితి ఏర్పడింది. ఒకసారి నలిగిన పువ్వు దారిలో పడి ఉంటే అందరిచేతా త్రొక్కబడి అథఃపాతాళానికి పోతుంది. వేశ్యాగృహాలే స్వగృహాలవుతాయి. అంతకంటె రహస్యంగా వ్యాపారం చేసుకొంటూ అందరు పెద్దమనుషుల్లా ఈ సంఘంలో ఎందుకు బ్రతకకూడ దనుకొన్నాను. అందుకే సరికొత్త నాటకం తయారుచేసి నాస్నేహితులకు చెప్పాను. అందుకు వాళ్ళు ఒప్పుకో లేదు. నన్ను మందలించారు. చివరకు నేను ఆత్మహత్య చేసు

కుంబా ననడంతో సరే నన్నారు. అదే మేము నిగదిలో ఆడిన నాటకం. నేను ఝాన్సీగా, నామిత్రులు భగవాన్‌దాసు, నిరంజన దాసులుగా నటించి అసలు వ్యక్తులము మేమేనని మిమ్మల్ని నమ్మించాము. పెద్ద పెద్ద పట్టణాలలో మకాం వేయడం, అక్కడ గొప్ప ఉద్యోగస్థుల్లో పరువుకోసం ప్రాకులాడే మీలాంటి అమాయకుల్ని, కామాంధకారంతో కళ్ళుమూసుకుపోయిన వాళ్లను, పగలు నీతిగాను, చీకట్లో అవినీతిగాను వ్యవహరించే మహాను భావుల్ని పసిగట్టి ఆ ప్రాంతానికి తగ్గపేర్లు చిరునామాలుమారుస్తూ బ్లాక్ మెయిలుచేసి రోజులు గడుపుతున్నాము.

బ్రతకడానికి మార్గం ఇదా? అని మీరసహ్యించుకోవచ్చు. తినడానికి తిండిలేక, కట్టడానికి బట్టలేక, నిలువ నీడలేక నాలాంటి అభాగ్యులు కూటికోసం చేసేది తప్పా? ఇదే తప్పయితే, ఇంత చదువుకొని ఉద్యోగం లేని మాకు ఏది దారి? అని ప్రశ్నిస్తున్నాను. ఈ ప్రశ్నకు బదులివ్వగలరా? మీరు ఇవ్వలేరు. మీరేకాదు ఎవరూ ఈ ప్రశ్నకు జవాబు చెప్పలేరు. ఏది ఏమయినా మీరు తెలిసి చెప్పినా, తెలియక చెప్పినా, "నిన్ను పెళ్ళిచేసుకొంటాను" అన్న మాటలు నాకే కాదు. మా స్నేహితులకుకూడా ఎంతో ఆనందాన్ని కలిగించింది. కాని ఈ ప్లాస్టిక్ పువ్వును మీకు సమర్పించుకోలేను. అందరూ త్రాగుబోతుల్ని, వేశ్యాలోలుర్ని ఇంత వరకూ మోసగించాము. మీనిష్కల్మషమైన హృదయం మాలో ఎంతో మార్పును కలుగజేసింది. మేము ఈవ్యాపారానికి ఇంతటితో స్వస్తి చెబుతున్నాము. మీ వస్తువులు మీకు తిరిగి ఇచ్చే అవకాశం లేదని తెలియజేస్తున్నందుకు క్షమించండి. ఇప్పుడు ఎన్నో మైళ్ళ దూరంలో ప్రయాణం చేస్తుంటాను. రాత్రి రైల్వే స్టేషన్లో ఈవుత్తరం తయారుచేశాను.

ఇప్పుడు చెప్పండి. ఇంకా నన్ను పెళ్ళిచేసుకుంటా నంటారా?

ఎన్నో క్షమాపణలతో,
మీ ఝాన్సీ.

అనిల్‌కుమార్ కళ్ళలోంచి నీరు ఉబికింది. అతని గుండె ఆవేదనతో నిండిపోయింది. అతను జరిగిపోయిన నష్టాన్ని గురించి ఆలోచించడం లేదు. జారిపోయిన వజ్రాన్ని గురించి బాధపడుతున్నాడు. "అవును! ఝాన్సీ! నీ వడిగిన ప్రశ్నకు నేనే కాదు మహా మహా మేధావులు కూడా జవాబు చెప్పలేరు. బాగా అభివృద్ధి చెందిన దేశాల్లోనే అనెంప్లాయిమెంటు ఉంది. ప్రభుత్వం ఎన్ని చర్యలు తీసుకొన్నా అనెంప్లాయిమెంటు పెరిగిపోతూనే ఉంది. ఈ ప్రాబ్లెమ్ మానవలోకం ఉన్నంతకాలం ఉంటుంది." అనుకొన్నాడు.

"ఝాన్సీ నీకథంతా వినికూడా నిన్నే పెళ్ళిచేసుకోవడానికి నా మనసు ఉవ్విళ్ళూరుతోంది, ఝాన్సీ! నీ నిష్కల్మష హృదయం, చేసిన తప్పు ఒప్పుకోవడం నీ త్యాగ నిరతి నన్ను ముగ్ధున్ని చేశాయి! మళ్ళీ ఒకసారి కనిపించు ఝాన్సీ. మళ్ళీ ఒకసారి కనిపించు వేదనతో తల పట్టుకొన్నాడు అనిల్‌కుమార్.



# మనసులోని చీకటి

అది హైదరాబాదు మహానగరం. ఆకాశాన్నంటే స్కై స్క్రేపర్సు ఆ నగరంలో ఉన్నాయి. ఎత్తయిన తాటిచెట్ల పక్కన పెరిగిన మూరెడెత్తు వెంపలి చెట్లులా స్కై స్క్రేపర్సు పక్కనే చిన్న చిన్న డాబా ఇళ్ళు ఉన్నాయి. జిరాఫీ ఒంటిమీద చారల్లా చక్కగా సాగిఉన్న రోడ్లు వాటిని కలుపుతూ సిలువ గుర్తుల్లా అడ్డరోడ్లు ఉన్నాయి. ఈగల్లా రొదచేసే మోటారు వాహనాలు ఆ సిటీలో తిరుగుతుంటాయి గద్దల్లా ఎగిరే విమానాలుకూడా ఉన్నాయి. నిమిషం తీరికలేక తిరిగే వ్యాపారస్తులు, ఉద్యోగస్తులు, క్షణం గడచే దెలాగ అని ఆలోచించే నిరుద్యోగులూ ఉన్నారు. అందుకే అన్నారు నగర జీవనం నేలనల్ల మరిగే వేడినీటి లాంటి దని, పల్లెటూరు జీవనం కొత్తకుండలో చల్లని నీరని.

ప్రవాహంలో కొట్టుకుపోయే మహావృక్షాలు, సుగంధ ద్రవ్యాలు, మురికి దిబ్బలు, చెత్తా చెదారంలా నగరంలో వ్యాపారస్తులు, ఉద్యోగస్తులు, గౌరవనీయులు, దొంగలు, హంతకులు, దోపిడీదార్లతో కలిసి కలగా పులగంగా ఉంటుంది జన ప్రవాహం. అందుకే ఎక్కడో మారుమూల పల్లెటూళ్ళలో దొంగతనాలు, హత్యలు, మానభంగాలు చేసిన దుర్మార్గులు నగరాలకు వచ్చి జన ప్రవాహంలో కలిసి పోతూంటారు. ఇక్కడ ఎవరు ఎవరో గుర్తించడం కష్టం. పెద్దమనిషి అనుకున్న వాడిని కదిలించి చూస్తే వాడు పదిమందిని చంపిన వాడయి ఉంటాడు. అలాగే నీ దృష్టిలో చెడ్డవాడుగా కనిపించినవాడు పది కాపురాలు నిల బెట్టిన దానకర్ణుడయి ఉంటాడు. అందుకే నగరాల్లో ఒకర్ని ఒకరు పట్టించుకోరు. ఎవరి జీవితం వారిది.

విజయకుమార్ కోటీ సెంటరులో బస్‌స్టాప్ దగ్గర నిలబడి ఉన్నాడు అతను నగరంలోని ఒక బాంకులో ఆఫీసరుగా పనిచేస్తు న్నాడు. పుట్టుకతోనే ధనవంతుడు. ఎప్పుడూ ట్రిమ్‌గా బాయిలెట్ అయి నీట్‌గా ఉంటాడు. అయితే అతనికుండే ఒకే ఒక లోపం స్త్రీ వ్యామోహం అది తీసేస్తే ఈలోకంలో అంతకంటే మంచి వాడు ఉండకపోవచ్చు, అందమైన యువతి భార్యగా దొరికి, ఇద్దరు పిల్లలు పుట్టినా అతనికీ జాడ్యం పోలేదు. బాంకు పనిచేసే రోజుల్లో స్కూటరుమీద వెళ్ళి వస్తూంటాడు. సెలవయితే చాలు సిటీ బస్సులో తిరుగుతూ వీలున్నంతవరకు లేడీస్‌తో పరిచయాలు కల్పించుకునేందుకు ప్రయత్నిస్తూ ఉంటాడు. ప్రస్తుతం ఇంజ నీరింగు కాలేజీలో బి ఇ. చదువుతున్న బావమరిది ఏదో ఫంక్షన్ ఉందని రమ్మనడంతో యూనివర్శిటీ కాంపస్‌కు బయలుదేరాడు.

ఇంతలో అతను ఎక్కవలసిన బస్సువచ్చి ఆగింది. విజయ కుమార్ యూనివర్శిటీ కాంపస్‌కు టికెట్ కొట్టించాడు. బస్సు లాంచింగ్ పాడ్ వదిలిన రాకెట్‌లా ముందుకు దూసుకుపోయింది. విజయకుమార్ ముందు చాలామంది లేడీస్ నిలబడి ఉన్నారు. విజయకుమార్ వాళ్ళ అందాలను చూపులతో తడిమి ఆనందిస్తు న్నాడు. హాంగరు పట్టుకుని నిలబడి ఉన్న అతను తన చూపులను అన్ని వైపులకు సారించాడు. తన పక్కనే సీట్లో కూర్చుని ఉన్న ఇరవైఅయిదేళ్ళ స్త్రీ మూర్తిని చూడగానే "అరె, కృష్ణవేణి. ఇది కలా, నిజమా" అనుకున్నాడు.

"హల్లో విజయ్! ఎన్నాళ్ళకు చూశాను" అంది చేయిపైకెత్తి.

"దాదాపు ఆరేళ్ళు." గొణిగాడు ఆమెనే చూస్తూ. ఆమె అందంగా ఆకాశం లోంచి వూడిపడిన దేవకన్యలా ఉంది. ఇన్ని జరిగిన తరువాత తనను పలకరిస్తుందని అతను వూహించలేదు.

"మా ఇంటికి పోదాం రండి'' అంటూ తను దిగవలసిన స్టేజి చెప్పింది. అది అతను దిగవలసిన స్టేజికి ఇంకా ముందు ఉంది.

"అలాగే, కృష్ణవేణి!'' అన్నాడు విజయకుమార్

అతని మనసు ఆనందంతో పూగి పోయింది. కాలేజీలో తన క్లాసుమేటు కృష్ణవేణికి, ఈనాటి కృష్ణవేణికి ఏం తేడా లేదు. అయితే ఆనాడు జలజల పారే సెలయేరులా ఉండేది, ఈనాడు శరీరానికి నిండుదనం వచ్చి ఇంకా అందంగా ఉంది. ఎంతమంది పిల్లలో? అసలు పిల్లలున్నారో. లేరో, మొగుడ్ని వదిలేసిందా ? ఇంకా మొగుడితోటి కాపరం చేస్తూంవా? ఎన్నోసందేహాలొచ్చాయి విజయకుమార్‌కి. 'ఆ. ఆ మసిబొగ్గు మొగుడితో ఇంకా ఏం కాపరం చేస్తుందిలే. ఎప్పుడో వదిలేసి ఉంటుంది. ఈమె అందానికి వాడి అనాకారితనానికి పొంతన ఎక్కడ,' అని తన సందేహాలకు తనే సమాధానం చెప్పుకున్నాడు.

అతని ఆలోచనలు తనకాలేజీ జీవితంలోకి వెళ్ళిపోయాయి.

డబ్బు చేతినిండా ఉండడంతో విజయకుమార్ విద్యార్థి జీవితం ఒక మధుర స్వప్నంలా జరిగి పోయింది. అతను ఒక విద్యార్థి వర్గానికి నాయకుడు. కాలేజీలో అతని పేరు వినని వారు లేరు. ఆతని చుట్టూ మిత్రులు ఈగల్లా ముసురుతుండేవాళ్ళు. సినిమాలు, షికార్లు, సిగరెట్లు, మందు పార్టీలతో కోలాహలంగా ఉండేది. విజయకుమార్ ఎంతో మంది అమ్మాయిల్ని తన చుట్టూ తిప్పుకుని వాళ్ళ దగ్గర సుఖాలు రుచి చూశాడు.

అయితే విజయకుమార్ దృష్టి మొదటినుంచీ కృష్ణవేణి మీద ఉంది. ఆమె అందం అతన్ని పిచ్చెక్కించేది. ఎంతో సోషల్‌గా నవ్వుతూ మాట్లాడుతుంది. అయితే అతను అంతకంటే చొరవ తీసుకులేకున్నాడు. ఎంతోమందిని మెస్మరిజం చేసిన తన డబ్బు ఆమె నేమీ చేయలేకపోవడం అతనికి వింతగా ఉంది.

"ఒరే ఎంత బెట్టుచేసినా ప్రయత్నిస్తే నీవల్లో పడకపోదు ముందుకు పోరా, నాయనా" అనేవాళ్ళు వందిమాగధులు కాఫీ తాగి, అతని జేబులోంచి చనువుగా సిగరెట్లు లాక్కుని కాల్చుతూ.

"ఒరే హేమలత ఎంత స్ట్రిక్టుగా ఉండేది దానిబెట్టు, అది, ఏమయింది చివరకు నీచేతిలో" అంటూ విజయకుమార్‌కు ధైర్యం చెప్పేవాళ్ళు.

ఎలాగయినా ఈవిషయం ఫైనలైజు చెయ్యాలని నిర్ణయించుకున్నాడు విజయకుమార్.

ఆ రోజు లైబ్రరీ నుంచి ఒంటరిగా వస్తున్న కృష్ణవేణి అనుసరించాడు.

"కృష్ణవేణీ! క్లాను టెస్టులో ఫస్టు మార్కులు వచ్చినందుకు కంగ్రాచ్యులేషన్స్''

"ఇవేం ఫస్టు క్లాసులు, విజయ్! పబ్లిక్ పరీక్షల్లో వస్తే గదా ప్రయోజనం."

''దానికయినా పునాది ఇదే కదా!"

"అవుననుకో, ఇంతకీ నీకెన్ని మార్కులు వచ్చాయి?"

"నే నసలు పరీక్షకు అటెండు కాందే'' నవ్వుతూ అన్నాడు విజయకుమార్.

"పాపం! తమరికి ఫ్రెండ్స్, డ్రింకు పార్టీలు, నాయకత్వాలు, కాలేజీలో హీరో వయితివి. పరీక్షలు రాసి తమ విలువయిన కాలాన్ని వేస్టుచేసుకోలేరు గదా!" ఫక్కున నవ్వింది.

ఆ నవ్వే విజయకుమార్‌ను దూర దూర తీరాలకు తీసుకుపోతుంది. ఆమె ఎంత అందంగా ఉంటుందో అంత మధురంగా నవ్వుతుంది. అంతకంటె ఆత్మీయతగాకూడా మాట్లాడుతుంది.

"నేను పరీక్షలు రాయకపోయినా కష్టపడి చదివి మంచి మార్కులు తెచ్చుకొనే వాళ్ళంటే నాకెంతో అభిమానం.''

''అబ్బ ఎంత ఉత్తములు.'' నవ్వింది.

''కృష్ణవేణీ! ఒక మాట.''

''ఏమిటి విజయ్?"

"నువ్వు చాలా అందంగా ఉంటావు "

''ఈ రోజే తెలిసిందా!"

"సారీ నువ్వు అందంగా ఉంటావని చెప్పడమే అన్యాయం. అలా ప్రత్యేకంగా చెప్పడంవల్ల ని అందాన్ని అవమానించి నట్లవుతుంది ''

"ఎందుకో ఈరోజు హఠాత్తుగా కొత్తటాపిక్ ఎత్తావు."

"ఎప్పటికయినా ఎత్తాలిసిందే కదా!"

''అది కాదులే ఇంతకుముందు ఎప్పుడు మాట్లాడినా నువ్వు చూసిన సినిమాల గురించో. మీకు వచ్చే రాబడి గురించో చెప్పేవాడివి ఈరోజు కొత్తగా ఉంటే అందుకు"

"ఆవిషయం వదిలేయ్, కృష్ణవేణీ! ఈరోజు నీ అందం గురించి మాట్లాడానంటే నీకేదయినా అర్థమయిందా?"

"అబ్బేలేదు.'' పెదవులు చప్పరిస్తూ అంది కృష్ణవేణి.

"సరే ఇప్పుడు చెబుతున్నాను విను. నీ అందం నన్ను మత్తెక్కించింది. నేను నిన్ను ప్రేమస్తున్నాను "

పక్కనే నడుస్తున్నదల్లా ఆగి అతని కళ్ళల్లోకి రెప్ప లల్లారుస్తూ చూసింది. విజయకుమార్‌కూడా ఆమె సోగ కళ్ళల్లోకి మత్తుగా చూశాడు. ఆమె మవునంగా నడవడం మొదలుపెట్టింది.

"కృష్ణవేణీ! నేను నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమించాను. నీ బంగారు ఛాయ మేని రంగు, నీ విశాలమైనకళ్ళు నన్ను ఎంతగానో ఆకర్షించాయి. ఎంతోకాలం నుంచి ప్రేమిస్తున్నా. ఆ ప్రేమ బయటపెట్టలేక సతమతమయ్యేవాడ్ని. అలా పార్కుకు వెళదాం.

దొరికిన సమయాన్ని వృధా చేసుకోకుండా ఒకరి అభిప్రాయాన్ని మరొకరం తెలుసుకుందాం."

"హలో! శ్యామసుందర్! ఉదయం కాలేజీకి రాలేదేం?" విజయకుమార్ మాటలకు జవాబు చెప్పకుండా అడిగింది.

తల వంచుకుని నడిచి వస్తున్న ఆవ్యక్తి "తలనొప్పిగా ఉండి రాలేకపోయానండీ" అన్నాడు.

"అయ్యో! అలాగా! అలా కాంటీను వైపు వెళ్దాం పదండి కొంచెం కాఫీ తాగుదాం, విజయ్! నాకు పనుంది నేవస్తా" అంటూ శ్యామసుందర్, 'నాకేం పరవాలేదండి. ఇప్పుడు తగ్గిపోయింది' అంటున్నా వినకుండా అతన్ని కాంటీను వైపు లాక్కుపోయింది.

విజయకుమార్ వెళుతున్న కృష్ణవేణిని, శ్యామసుందర్ని కసిగా చూశాడు. నల్లగా, సన్నగా ఏ ఆకర్షణాలేని శ్యామసుందర్ అంటే ఎందుకు కృష్ణవేణి కింత అభిమానం. క్లాసులో ఎప్పుడు ఏ సందేహమొచ్చినా శ్యామసుందర్నే అడుగుతుంది. ఇంట్లో మనిషిలా ప్రవర్తిస్తుంది.

కృష్ణవేణి వెన్నెలయితే, శ్యామసుందర్ చీకటికి సింబల్. కృష్ణవేణి జలపాతం అయితే, శ్యామసుందర్ బండరాయి. శ్యామసుందర్ మంచి పాటగాడని పేరు. వాడిపాటలంటే తనకు ఒళ్ళుమంట. వాడి పాటలు వినాలని ఎంతోమంది ఆడపిల్లలు వాడి చుట్టూ మూగుతారు. కాని ఏం లాభం? వాళ్ళతో అంటీముట్టనట్లు మాట్లాడుతాడు. అదే తనయితే వూరకుండేవాడా?

ఆలోచనలతో క్లాసు రూము చేరుకున్నాడు. స్నేహితుల బృందం ఇతన్ని ఓదార్చారు.

"విజయకుమార్! బాధ పడకురా! ఈసారి ఇంకొద్దిగా ముందుకు పో. ప్రేమ ఎప్పుడూ ఒక్కసారిగా సక్సెస్ కాదు."

"డోన్ట్ బి డిస్కరేజియస్ మైడియర్ విజ్జీ! ఆమె నిన్ను ప్రేమించలేదని చెప్పలేదు గదా. ఏదో స్నేహితుడని అలా కాఫీకి వెళ్లింది. అంతమాత్రానికి నువ్వింత ఉక్రోష పడితే ఎలా?"

"ఒరేయ్! ఈసారి ఎక్కువటైమ్ తీసుకోనయినా నిదానంగా మాట్లాడు. ఒక్కసారి నీ వలలో పడిందంటే చాలు. కుక్కలా నీవెంట తిరుగుతుంది. చివరకు వదిలించుకోవడం నీకు సమస్య అవుతుంది."

స్నేహితుల సలహాలు విజయకుమార్‌లో మరలా ధైర్యం పుంజుకునేట్లు చేశాయి. ఈసారి సామ, దాన, భేధ, దండోపాయాలు ఏది ఉపయోగించయినా సరే ఆమెను తన వైపు తిప్పుకోవాలి అనుకున్నాడు.

మరుసటి రోజు క్లాసు కాగానే అందరూ ఇండ్లకు బయలుదేరారు.

విజయకుమార్ అమ్మాయిల గుంపు ననుసరించి "కృష్ణవేణీ! మాట" అని పిలిచాడు. అమ్మాయిలు విజయకుమార్‌ని, కృష్ణవేణిని మార్చి మార్చి చూశారు. కారణం విజయకుమార్ రాసలీలలు అందరికీ తెలిసి ఉండడమే

"ఏమిటి?" అంది కృష్ణవేణి అమ్మాయిల్ని వదిలి వెనక్కు వచ్చి.

"అలా పార్కుకు వెళదాం. నీతో కొన్ని విషయాలు మాట్లాడాలి."

"పార్కుకు ఎందుకు విజయ్! ఏవైన విషయాలుంటే చెప్పు ఇక్కడే."

"ఇక్కడ చెప్పేవి కాదు."

"సరే. ఈసారెప్పుడైనా చూద్దాంలే"

"నువ్వేదో ధైర్యస్థురాలవనుకున్నాను కృష్ణవేణి! ఇంత భయమా నీకు?"

''భయం దేనికి, వెళదాంపద."

ఇద్దరూ కాలేజి పార్కులోకి నడిచారు. దూరంగా చెట్లకి నీళ్ళు పెడుతున్నాడు తోటమాలి. మెత్తని పచ్చికమీద కూర్చున్నారు ఇద్దరూ.

"ఇప్పుడు చెప్పు ఏమిటో?"

విజయకుమార్ గడ్డి పరకలు తుంచి విసిరి వేస్తూ నెమ్మదిగా అన్నాడు.

"కృష్ణవేణీ! నేను నిన్ను ప్రేమిస్తున్నాను. ఆ విషయం చెప్పడానికే నిన్ను రమ్మన్నది."

"సారీ విజయకుమార్! ఈ విషయంలో కాదన్నందుకు మన్నించు." లేచి నిలబడింది.

"కృష్ణవేణీ! ప్లీజ్ నా ప్రేమను తిరస్కరించకు" దీనంగా అడిగాడు విజయకుమార్ తనూ లేస్తూ.

"మిస్టర్ విజయకుమార్! ప్రేమమీద నాకు కొన్ని ప్రిన్సిపుల్స్ ఉన్నాయి. నాకాబోయే భర్తకు ఉండవలసిన లక్షణాలు ముందే నిర్ణయించుకున్నాను."

"అయితే నాకు అలాంటి లక్షణాలు లేవని నీ అభిప్రాయమా"?

"నేను అలా అనలేదు. ప్రస్తుతానికి నన్ను వదిలెయ్" అంటూ వెనుదిరిగింది కృష్ణవేణి.

''మైడియర్ కృష్ణవేణీ! ఐ కాంట్ లివ్ విదౌట్ యూ. ప్లీజ్! ప్రేమించానని చెప్పు."

"అయామ్ సో సారీ!" విసవిసా నడిచింది కృష్ణవేణి.

"కృష్ణవేణీ! నువ్వు కాదంటే నేను చచ్చిపోతాను" అంటూ ఆమెకు ఎదురు నిలబడి అమాంతం కౌగిలించుకుని ముద్దు పెట్టుకున్నాడు. కృష్ణవేణి ఈడ్చి కొట్టింది.

కండక్టరు అరుపులకు వూహల్లోంచి ఈలోకంలోకి వచ్చాడు విజయకుమార్ చెంప తడుముకుంటూ. తమ దిగవలసిన స్టేజి ఇది

"విజయ్! సీటుందిగా కూర్చో. నిలబడ్డావేం?" అంది కృష్ణవేణి. విజయకుమార్ సిగ్గుపడ్డాడు. సీట్లు చాలా ఖాళీ ఉన్నాయి. అయినా తను హాంగరు పట్టుకుని నిలబడే ఉన్నాడు. విజయకుమార్ ఒక సీట్లో కూర్చున్నాడు. అక్కడ నుంచి కృష్ణవేణి చెప్పిన స్టేజి వరకు టికెట్ కొట్టించాడు.

బస్సు బయలుదేరింది. దాంతోపాటు అతని వూహలు మళ్ళీ మొదలయ్యాయి.

కృష్ణవేణి తనను చెంపదెబ్బకొట్టి అవమానించిన తరువాత ఆమెను ఏమిచేయడానికైనా వెనకాడలేదు విజయకుమార్. ఆమెను నాశనం చేయడానికి ఎన్నో ప్రయత్నాలు చేశాడు. చివరకు ఏదీ ఫలించలేదు ఆఖరుకు నిజంగానే కృష్ణవేణిని పెళ్ళాడాలని పెద్ద మనుషులద్వారాకూడా సంప్రదింపులు చేశాడు. కృష్ణవేణి స్సేమిరా చేసుకోనంది. దాంతో నిరాశపడిపోయాడు విజయకుమార్

ఇది విజయకుమార్ జీవితంలో ఒక షాకయితే ఇంకో భయంకరమైన సంఘటన జరిగింది మవున యోగిలా ఉండే అనాకారి శ్యామసుందర్‌ని కృష్ణవేణి ఫైనలియర్లో రిజిస్టరుమారేజి చేసుకోవడం. ఇంత అందమైనతను ఉంటే తనను కాదని గాలికి ఎగిరే ఆకులాంటి శ్యామసుందర్‌ని ఎందుకు చేసుకుందో అతనికి అర్థం కాలేదు. తనకు చేసిన అన్యాయానికి తగిన శిక్ష అనుభవిస్తుందిలే అనుకున్నాడు. ఆమె చూసేట్లుగా ఆ సంవత్సరాంతం వరకు ఆమె ముందే ఎంతో ఖర్చుపెట్టి ఎంతోమంది ఆడవాళ్ళతో స్నేహం చేశాడు.

ఆఖరుకు ఒకసారి ఉండబట్టలేక కృష్ణవేణిని అడిగేశాడు.

"వాడ్ని ఏంచూసి చేసుకున్నావు కృష్ణవేణీ? ఛబ్బా! అందమా! ఏమీలేనివాడ్ని చేసుకుని ఎలా బతుకుతావు?"

"విజయ్! ఈ ప్రశ్నకు ప్రస్తుతం నేను జవాబు చెప్పలేను. కాలం జరగనీ. కాలంతోపాటు జీవితమే ఈ ప్రశ్నలకు జవాబు చెబుతుంది" అని తప్పించుకుంది.

తరువాత కాలేజి చదువు పూర్తికావడంతో ఎవరి జీవితాలు వారివయ్యాయి. విజయకుమార్ జీవితంలో ఈ సంఘటన కొంత కాలం మాత్రమే గుర్తున్నది. ఇప్పుడు ఇలా కలుసుకోవడంవల్ల కోర్కెలు తిరిగి తలెత్తాయి. ప్రస్తుతం కృష్ణవేణి ఖచ్చితంగా తన అనాకారి భర్తను వదిలేసి ఉంటుంది. తన అదృష్టం బాగుంటే ఇక తనను సుఖపెడుతుంది అనుకున్నాడు.

ఇంతలో తాము దిగవలసిన స్టేజి వచ్చేసరికి కృష్ణవేణిలేచి నిలబడింది. ఆమె వెనకనే విజయకుమార్కూడా దిగాడు. కృష్ణ వేణి కొద్దిదూరం నడిచి ఒక సందులోకి మలుపు తిరిగింది.

"కృష్ణవేణీ! సుఖంగా ఉన్నావా?" ఆత్రతననుచుకుంటూ అడిగాడు విజయకుమార్.

"ఈ మానవ జన్మకు ఎప్పుడూ సుఖమంటూ ఉండదు, విజయ్! కోరికలు అనంతాలు. ఏ దశలోనూ మానవుడికి తృప్తి ఉండదు. ఒకటి దొరికినప్పుడు ఇంకోదానికోసం వెంపర్లాడు తుంటాడు."

'మెట్ట వేదాంతం చెబుతోంది కాబట్టి ఈ మనిషి సంసారం నాశనమయినట్లే! తనకు కావలసిందికూడా అదే! ఎలాగయినా తనను ఆమె హృదయంలోకి ఆహ్వానిస్తే చాలు' అనుకున్నాడు విజయకుమార్.

"నీ విషయ మేమిటి, విజయ్! ఏం ఉద్యోగం చేస్తున్నావు, భార్య ఎలా ఉంటుంది. పిల్లలెంతమంది"

విజయకుమార్ తన సంగతి చెప్పుకున్నాడు.

"అయితే ముత్యాల్లాంటి ఇద్దరు పిల్లలు. అందమయిన భార్య. మంచి ఉద్యోగం నువ్వు ఎప్పటికీ అదృష్ట జాతకుడివే. విజయ్!"

"నీలోనూ ఏమీ మార్పులేదు కృష్ణవేణీ! అప్పటికంటే బాగున్నావు."

"నీవుకూడా అంతే, విజయ్! అవే చిలిపిమాటలు అదే హుషారు. నాకెంతో ఆనందంగా ఉంది"

"నిజంగానా, కృష్ణవేణీ"

"నిజం, విజయ్. మనం నాలుగేళ్ళనుంచి ఈ మహానగరంలో ఉంటూకూడా ఒకరి నొకరం కలుసుకోకపోవటం దురదృష్టం. ఇలా యాదృచ్ఛికంగా కలుసుకోవడం మన అదృష్టం."

తరువాత కృష్ణవేణి కాలేజికబుర్లలోకి దిగింది. సంతోషంగా ఆనాటి సంఘటన లెన్నో వల్లెవేసుకుంది. తమ క్లాసుమేట్సు ఎక్కడెక్కడ ఏమేం చేస్తున్నారో తనకు తెలిసినంతవరకు చెప్పింది. తరువాత విజయకుమార్ తనకు తెలిసిన వాళ్ళ విషయాలు చెప్పాడు. నవ్వుకుంటూ కబుర్లు చెప్పుకుంటూ నడిచారు.

"ఇదే మాఇల్లు" అంది కృష్ణవేణి ఒక ఇంటి ముందు ఆగి.

అది రెండంతస్థుల భవనం. పైన రెండు పోర్షన్లు, కింద రెండు పోర్షన్లు ఉన్నాయి. కింద భాగంలోని ఒక పోర్షనులో ఉంటోంది కృష్ణవేణి.

కాలింగ్‌బెల్ నొక్కగానే ఒక ముసలావిడ వచ్చి తలుపు తీసింది.

"ఈవిడ మా అత్తగారు'' అంటూ పరిచయం చేసింది.

ముసలావిడ వెనుకనే "అమ్మా!" అంటూ వచ్చి కృష్ణవేణి కాళ్ళు పట్టుకున్నాడు అయిదేళ్ళవాడు.

"వీడు మా జ్యేష్ఠ పుత్రుడు. నాకు వీడంటే ఎంతో ఇష్టం. వాడికి నేనంటే ఇంకా ఇష్టం" అంటూ వాడ్ని పైకెత్తి పట్టుకుంది.

విజయకుమార్ వాడివైపు చూశాడు. వాడు నల్లగా, సన్నగా ఎలుకలా ఉన్నాడు. వీడు కృష్ణవేణి కడుపున ఎలా పుట్టాడో అనుకున్నాడు. కృష్ణవేణికి అనాకారులంటే ఎంతో ఇష్టంలాగుంది. తను అనాకరిగాపుట్టినా బాగుండేది అనుకున్నాడు విజయకుమార్.

"కృష్ణవేణీ! ఇంకా శ్యామసుందర్‌తో కాపురంచేస్తున్నావా?" ఆమె చూపిన కుర్చీలో కూర్చుంటూ ఉండబట్టలేక అడిగాడు.

ఆమె ముఖం వెలవెలా పోయింది.

"అంటే"? అని మాత్రమే అనగలిగింది.

విజయకుమార్ తల వంచుకున్నాడు.

"చూడు, విజయ్! నీవు ఏమాత్రం మారలేదు. శ్యామసుందర్ అనాకారివాడనీ, అందవిహీనుడని నేనేదో త్వరపడి చేసుకున్నానని, తరువాత వదిలేసి ఉంటానని అనుకున్నావు కదూ! నీ అంచనాలు తప్పు. ఆడది ఎప్పుడూ ఒకరినే ప్రేమిస్తుంది. ఒకరికే మనసిస్తుంది. అందగాడు, డబ్బున్నవాడు కనబడితే మొగుడ్ని వదిలేసి అతనివెంట పడదు. అలా వెంటబడేదయితే స్త్రీ తన జీవితకాలంలో ఎంతమంది భర్తల్ని మార్చాలి?" ఆవేశంగా ప్రశ్నించింది.

ఇంతలో శ్యామసుందర్ వచ్చాడు. రాగానే విజయకుమార్ వైపు ఆశ్చర్యంగా చూశాడు.

"మీరు విజయకుమార్‌గారు కదూ" అన్నాడు తడబడుతూ.

"మీరు, గారూ అంటా వేమిటి, శ్యాం, అతను మన క్లాస్ మేటు విజయ్."

శ్యామసుందర్ విజయకుమార్‌కి షేక్‌హాండిచ్చి, "విజయ్! ఎంతకాలానికి మనం కలుసుకున్నాం. ఇది నిజంగా మా అదృష్టం" అన్నాడు.

విజయకుమార్ తన మృదువైన చేతిలో గట్టిగా కొయ్యలా ఉన్న శ్యామసుందర్ చేతిని అంటీ ముట్టనట్లు పట్టుకుని వదిలేశాడు. శ్యామసుందర్ మునుపటికన్నా సన్నగా ఉన్నాడు కళ్ళకు అద్దాలు వచ్చాయి.

"కృష్ణవేణీ! బాబిగాడేడి?"

"ఎక్కడికైనా బయటికెళ్ళాడేమో!"

"నాతో తగాదా పెట్టుకుని అలిగి మావయ్య వాళ్ళింటికి వెళ్ళాడు, నాన్నా! నువ్వు బతిమాలించి తీసుకువస్తేనేకాని రాడట" పెద్దవాడు విషయం చెప్పాడు.

"అరె.... తీసుకొస్తానుండు" అంటూ అవతలి పోర్షను వైపు వెళ్ళాడు.

"అదీ విజయ్, విషయం, పెద్దవాడంతా వాళ్ళ నాన్న పోలిక. వాడంటే నాకెంతో ఇష్టం. చిన్నవాడు అచ్చం నా పోలిక. వాణ్ని వాళ్లనాన్న ఒక్క క్షణం వదిలిపెట్టడు. అనుబంధం అంటే అలా ఉంటుంది, విజయ్. నీకూ ఇద్దరు పిల్లలు ఉన్నారు కనక నేను చెప్పనవసరం లేదనుకుంటాను" అంది కృష్ణవేణి.

ఇంతలో శ్యామసుందర్ బాబిగాణ్ని తీసుకువచ్చాడు వాడు అచ్చం కృష్ణవేణిలా ఉన్నాడు. తెల్లగా, అందంగా, బొద్దుగా ఉన్న వాణ్ణి ఎత్తుకోకుండా ఉండలేక పోయాడు. విజయకుమార్‌ని, అతని ఒడిలో ఉన్న బాబిగాణ్ని దంపతు లిద్దరూ తృప్తిగా చూశారు. బాబుమాత్రం విజయకుమార్ వైపు ఉరిమి చూశాడు, తనను అసలు పలకరించనుకూడా పలకరించనందుకు.

"ఇంతకూ విజయ్‌కు టిఫిన్ పెట్టావా" అన్నాడు శ్యామ సుందర్ హఠాత్తుగా,

"టిఫిన్ ఏమిటి....ఏకంగా భోజనం తయారుచేస్తున్నాను "

''భోజనం చేయకుండా ఎలా వెళతాడు. ఈలోగా టిఫిన్ పెడితే బాగుంటుందని."

"ఫరవాలేదు, శ్యాం! నేను అర్జంటుగా వెళ్ళాలి. టిఫిన్‌లు, భోజనాలు పెట్టుకోకండి."

"అదేం కుదరవు, విజయ్! భోజనం చేయందే ఇక్కడ నుంచి కదలడానికి వీల్లేదు. శ్యాం! నువ్వుమార్కెట్‌కివెళ్ళి ఈఅయి టమ్స్ అర్జంటుగా తేవాలి" అంటూ కాగితంమీద ఏవో వ్రాసి ఇచ్చింది.

శ్యామసుందర్ సంచితీసుకుని, సైకిలుమీదవెళ్ళిపోయాడు.

అత్తగారికి సాయంచేయడానికి కృష్ణవేణి వంట రూము లోకి వెళ్ళింది.

విజయకుమార్‌కు ఇక అక్కడ ఉండబుద్ధి కాలేదు. కృష్ణ వేణి భర్తను వదిలేసి ఒంటరిగా ఉంటే తమ పూర్వ పరిచయాన్ని పురస్కరించుకుని జారిపోయిన క్షణాల్ని జాగ్రత్తచేసుకుందామను కున్నాడు. కానీ, జరిగిందేమిటి? కృష్ణవేణి భర్త, పిల్లలతో సంతో షంగా ఉంది. ఒళ్ళోని పిల్లవాడ్నికిందికిదింపి లేచి నిలుచున్నాడు.

కృష్ణవేణిని పిలిచాడు.

'"ఏమిటి విజయ్" అంటూ వచ్చింది కృష్ణవేణి .

"ఇక నేను వెళతాను, కృష్ణవేణీ!"

''అదేమిటి, విజయ్! శ్యాంని ఇప్పుడేకదా ఫ్రూట్స్ తెమ్మని పంపాను. భోజనం చేయకుండా ఎలా వెళతావు?"

"సారీ....తలనొప్పిగా ఉంది."

"అరె అలాగా! టాబ్లెట్ తెస్తానుండు. ఇంట్లో ఉండాలి." హడావుడిగా లోపలికి వెళ్ళబోయింది

''అగు, కృష్ణవేణి! అది టాబ్లెట్‌తో తగ్గేదికాదు."

"అంటే"

"అవును, కృష్ణవేణి! నీవులేని నా జీవితం శూన్యం అని పిస్తూ ఉంది!" ఏమయితే అదయిందని కడుపులోని బాధ బయట పెట్టాడు.

కృష్ణవేణి ఒక క్షణం దిగులుపడిపోయింది. తరువాత లేని హుషారు తెచ్చుకుంటూ- "విజయ్! ఏ కారణంచేత నిన్ను పెళ్ళి చేసుకోలేకపోయానో చెబుతాను విను" అంది.

విజయకుమార్ ఏం చెబుతుందో విందామని కూర్చున్నాడు.

''విజయ్! నేను నిన్ను చెంపదెబ్బకొట్టి అవమానించిన తరువాతకూడా నీవు నావెంట బడడం చూసి నీనిష్కల్మష ప్రేమకు జోహారులర్పించాను, నిన్నే చేసుకోవాలనుకున్నాను. కాని, సెకండియర్ బి. ఎ లో యానివర్శరీ రోజు జరిగిన సంఘటనవల్లఅంతా తారుమారయింది."

విజయకుమార్ ఆశ్చర్యపోయాడు. కృష్ణవేణి తననునిజంగా వివాహమాడాలనుకుందా? అయితే జరిగిందేమిటి?

"ఏమిటా సంఘటన?'' ఆత్రతగా అడిగాడు.

''యానివర్శరీ రోజు విద్యార్థినీ, విద్యార్థులతో కాలేజి నిండుగా ఉంది. ఆరాత్రి ఆడిటోరియంలో విచిత్ర వేషధారణలు, నాటికలు జరుగుతున్నాయి. పక్కనేఉన్న గార్డెనులో లైట్లు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. కొంతమంది విద్యార్థులుకూడా అటూ ఇటూ సందడిగా తిరుగుతున్నారు. నేను అలా గార్డెనులోకి వెళ్ళాను. అక్కడే జరిగింది పొరపాటు. ఎవడో ఒకవిద్యార్థి పొంచి

ఉండి గార్డెనుకు కరెంటు సప్లైచేసే వైర్లు కట్‌చేశాడు. గార్డెనంతా చీకటిమయమైపోయింది. తరువాత నన్నెవరో అరవకుండా నోరు మూసితీసుకునిపోయారు. తరువాత శీలం కోల్పోయాను. ఒకరి తరువాత ఒకరుగా నలుగురు నాశీలాన్ని అపహరించి ఎటో వెళ్ళి పోయారు, కొంతసేపటికి తేరుకున్న నేను నిలబడి చుట్టూచూశాను నేను గార్డెనుకు ఒక ఫర్లాంగు దూరంలో ఒక పాడుబడ్డ ఇంట్లో ఉన్నాను.

నాకు జరిగిన అన్యాయానికి ఎంతోకాలం రోదించాను. శీలం పోగొట్టుకున్న నేను నీకు భార్యగా అర్హురాలిని కాను. అదే సమయంలో శ్యామసుందర్‌కు సీక్రెట్‌గా విషయం చెప్పి నన్ను వివాహం చేసుకోమన్నాను. శ్యామసుందర్ నామాట కాదనలేక రిజిష్టర్‌మారేజి చేసుకొన్నాడు. ఇప్పుడు చెప్పు నేను నీకు అన్యాయం చేశానా?"

విజయకుమార్‌కు తల తిరిగిపోయింది. ఎంతపని జరిగింది. ఒక అపవిత్రురాల్ని తాను దైవంగా ప్రేమించాడు. ఆమె పెళ్ళి చేసుకోక పోయేసరికి పిచ్చివాడయిపోయాడు. ఆమె జీవిత భాగస్వామిగాలేని తన జీవితం వ్యర్థమనుకున్నాడు. దేవుడు దయామయుడు. కాకపోతే తనను ఇంత ఘోరం నుంచి తప్పిస్తాడా ? ఆ శ్యాంసుందర్‌గాడొక యూసలెస్‌ఫెలో కాబట్టి కృష్ణవేణిని చేసుకున్నాడు ఎంత అందమున్నా శీలం పోగొట్టుకున్న ఆడదీ ఒక ఆడదేనా?

విజయకుమార్ అడుగులు ముందుకు వేశాడు. కృష్ణవేణి ఎంత బతిమాలినా వినిపించుకోలేదు. వెనక్కు తిరిగి చూడకుండా నడిచి వెళ్ళాడు. అతన్ని బతిమాలుతూ గుమ్మం వరకు వచ్చిన కృష్ణవేణి కారేకన్నీటితో అలాగే నిలబడిపోయింది.

"విజయ్! ఎందుకలా వెళ్ళిపోతావు. శ్యామసుందర్‌ను నేను చేసుకున్నాననే బాధ నీలో సుళ్ళు తిరుగుతుందని, ఆ భాధ పోగొట్టడానికి నన్ను నేను వంచనచేసుకుని, పవిత్రంగా భావించే నాశీలాన్నికూడా పోగొట్టుకున్నానని నీకోకల్పితకథ చెప్పాను. దేనికి? సృష్టిలోతీయనైన, అతిపవిత్రమైన స్నేహంకోసం. స్నేహితులంటే ప్రాణంవిడిచే నన్ను అర్థంచేసుకుని నీ స్నేహామృతాన్ని పంచివ్వలేకపోయావు.

నీ మనసులోని చీకటి తెరల్లోకి కాంతి ఇంకా రాలేదు విజయ్! ఇక ఎప్పటికీ రాదేమో, కాని నీవనుకున్నట్లు శ్యాంసుందర్ చూడడానికి అనాకారో, అందవిహీనుడు కావచ్చేమో కాని అతని మనసు అందమైనది, విజయ్! నీళ్ళకంటె స్వచ్ఛమైనది. గాలి కంటే పలుచనైనది. నన్ను అర్థంచేసుకున్నవాడు. నాఆలోచనలకు, ఆశయాలకు వూపిరిపోసేవాడు. అది నీకు అర్థంకాదు, విజయ్! అందుకే గుండె లోపలి పొరల్లోకి చూడలేని నీకు అతను అనాకారిగా కనిపిస్తాడు. ఇప్పుడు నీవు వెళ్ళిపోయావని తెలిసి శ్యాం గుండె తపనతో ఎలా కొట్టుకుంటుందో!'' నిలబడేశక్తి లేనట్లుగా ఆమె గుమ్మంలో కూలబడిపోయింది.



# విముక్తి

వెంకటరమణా విలాస్‌లో కాఫీ త్రాగి సిగరెట్ పీల్చుతూ బయటకువచ్చాడు ముకుందరావు. సాయంత్రంకావటంతో మెయిను బజారు జనంతో రద్దీగా ఉంది. రోడ్డుకు రెండు వైపులా ఉన్న షాపులు దీపాలంకరణ పూర్తిజేసుకొని, వింతకాంతులు వెదజల్లు తున్నాయి. సైకిలు నడిపించుకొంటూ అరుణా స్వీటు స్టాలుకు దారితీశాడు.

ముకుందరావు పి డబ్ల్యు.డి. ఆఫీసులో సీనియర్ అసి స్టెంట్‌గా పనిచేస్తున్నాడు. అతని భార్య అరుణ అదే ఊళ్ళో ఎలి మెంటరీ స్కూలు టీచరుగా ఉంది. ముకుందరావుకు రెండు నెలల క్రితమే ఈఊరుకు ట్రాన్స్ఫరు వచ్చింది. భార్యభర్తలు ఉద్యోగ స్థలయితే ఒకే ఊర్లో వేయాలి అనే జీ. వో సంపాదించి భార్యను కూడా ట్రాన్స్ఫరు చేయించుకున్నాడు.

ముకుందరావు స్వీట్లు పాక్ చేయించి సంచిలో పెట్టుకొని ఇటు తిరిగేసరికి వెనుకనుంచి ఎవరిదోచేయి భుజంమీద పడింది.

"హల్లో ముకుందం....ఎన్నాళ్ళకు దర్శనం'' ఉలిక్కిపడి ప్రక్కకు చూశాడు ముకుందరావు. ప్రక్కనే స్కూటరుమీద కూర్చొని కాలు క్రింద ఆనించి ఉన్న రాజారావు కర్చీఫ్‌తో ముఖం తుడుచుకుంటూ ముకుందరావుని చూసి నవ్వాడు.

"అరె....రాజారావ్ నువ్వా!.... పదేళ్ళ క్రిందట చూశాను ఇప్పుడెక్కడ?" అప్యాయంగా అడిగాడు ముకుందరావు.

"ఎక్కడేమిటి? ఇక్కడ స్టేట్ బాంకులో అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసర్‌గా ఉంటున్నా. ఇంతకీ నీవిషయం చెప్పు. చెల్లెమ్మా,

పిల్లలూ బాగున్నారా! ఎక్కడ ఉంటున్నారు. ఏమిటిసంగతులు?" టకటకా అడిగాడు రాజారావు.

"మూలాపేటలో ఉంటున్నా, రెండు నెల్లనుంచీ. ఇక నీవిషయం చెప్పు. విమలా వాళ్ళు ఎలా ఉన్నారు" పరామర్శిం చాడు ముకుందరావు. అపూళ్ళో తనవాళ్ళంటూ ఒకరున్నందుకు సంతోషంగా ఉంది.

"ఇంటికిరా! దగ్గరే అన్ని విషయాలు మాట్లాడు కొందాం" అంటూ ముకుందరావును బయలుదేరతీసి, తను సైకిలు స్పీడుకు అనుగుణంగా స్కూటరు నడపసాగాడు రాజారావు.

రాజారావు పిన్నమ్మ కూతుర్ని చేసుకొన్నాడు ముకుంద రావు. రాజారావు నాన్నగారు వ్యాపారంలో అందెవేసిన చేయి. బాగా సంపాదించాడు. డబ్బుంది కాబట్టి కొడుకును బాగా చది వించాడు. తరువాత అదే డబ్బుతో మంచి ఉద్యోగమూ వేయిం చాడు. అందుకే రాజారావు జీవితం వడ్డించిన విస్తరిఅయింది ప్రస్తుతం రాజారావు తండ్రి చనిపోయాడు. తల్లి మాత్రమే ఉంది.

రాజారావు భార్య "అన్నయ్యా" అంటూ ఆప్యాయంగా పల కరించి చాలా మర్యాద చేసింది ముకుందరావుని. రాజారావు తల్లి కూడా ఎంతో అభిమానంగా మాట్లాడింది. రోజూ ఉదయాన్నే డ్యూటీకి వెళ్ళి, సాయంత్రానికి తిరిగి వస్తూ రొటీన్ లైఫ్ గడుపు తున్న ముకుందరావుకి ఇది మంచి రిలీఫ్ అయ్యింది.

రోజులు గడిచిపోతున్నాయి. ఎప్పుడైనా సెలవు వస్తే రాజా రావు కుటుంబం ముకుందరావు ఇంటికి రావడమో, ముకుంద రావు కుటుంబం రాజారావు ఇంటికి పోవడమో జరుగుతూ ఉంది. బంధుత్వంలో ఉన్న అనుభూతిని, ఇరువైపుల వారూ అనుభవిస్తున్నారు.

ఓ ఆదివారం ముకుందరావు కుటుంబం రాజారావు ఇంట్లో కూర్చొని పిచ్చాపాటి మాటాడుకుంటున్నారు. ఇంతలో రాజారావు ఉన్నట్లుండి,

''ఒరేయ్ ముకుందం! మేము సౌత్ ఇండియా టూరు వెళ్దామనుకొంటున్నాము. మీరూ వస్తారా" అన్నాడు.

ముకుందరావుకు తెలుసు. రాజారావు లక్షాధికారి బిడ్డ ఇటువంటి టూర్లు ఎన్నయినా వేయగలడు. ఎంతయినా ఖర్చుపెట్టగలడు. తనకా స్తోమతు చాలదు. మొహమాటానికి పోతే తిప్పలు పడవలసి వస్తుంది.

"రాజారావ్! నేనీమధ్యఉన్న సెలవంతా వాడేసానోయ్. మరేం అనుకోకు. ఈసారికీ ప్రయత్నిస్తాలే" అన్నాడు ముకుందరావు బాగా ఆలోచించుకొని.

"అవునన్నయ్యా మాది సింగిలు టీచరు స్కూలు కాబట్టి సెలవు దొరకడం చాలకష్టం" అరుణ అంది.

"మీరు వస్తే బాగుంటుంది వదినా" విమల అందుకొంది.

"సరే అనవయ్యా ముకుందయ్యా! అందరం సరదాగా తిరిగొస్తాం" అంది రాజారావు తల్లి.

ముకుందరావు ఏం మాట్లాడలేదు. రాజారావు ఏదో ఆలోచనలోపడిపోయినట్లు కళ్ళుమూసుకొని కుర్చీలోవెనక్కువాలాడు. "సరే, ముకుందరావ్ నీఇష్టం" ఓ అయిదు నిముషాల తర్వాత అన్నాడు. తేలిగ్గా గాలి పీల్చుకున్నాడు ముకుందరావు.

"నాకో సహాయంచెయ్ ముకుందరావ్, ఎలాగూ రానంటివి. మా ఇంట్లొ ఇనప్పెట్టె ఉంది. మేంవచ్చేంతవరకూ కాస్త మీఇంట్లో ఉంచాలోయ్"

"దానికేం భాగ్యం అలాగే ఉంచుకొంటాం'' అని నాలుకకొరుకొని, "అరెరె....ఇనప్పెట్టా! .... దాంట్లో విలువయిన వస్తువు

లుంటాయి. అలాంటివి మా ఇంట్లో వద్దు. సారీరా!...." అన్నాడు ముకుందరావు గాభరాగా.

అతని గాభరాకు అందరూ నవ్వారు. ఒక్క ముకుందరావు భార్య తప్ప. ఆమెకు తెలుసు ఇటువంటి బాధ్యతలు పైన వేసు కొన్నందువల్ల కలిగే చిక్కులు

రాజారావు నవ్వుతూ, "గాభరాపడకురా! అందులో విలువైన వస్తువులేం లేవు. పేరుకు ఇనప్పెట్టె మాత్రమే. ఏవయినా పోతే నిన్నడగన్లే" అన్నాడు. అందరూ నవ్వారు. ఇకవాదించడం బాగుం డదని, "నాకిప్పుడు భయం తీరిపోయిందోయ్. నీ ఇష్ట ప్రకారమే మాఇంట్లో ఉంచు" తేలిగ్గా నవ్వేస్తూ అన్నాడు ముకుందరావు.

రెండు రోజుల తరువాత ఓఉదయం ఇనప్పెట్టెను తన ఆఫీను జీపులో పెట్టుకొని వచ్చి ముకుందరావు ఇంట్లో చేర్చాడు. రాజారావు. ఆరోజు సాయంత్రం మద్రాసుకు కారులో బయలుదేరి వెల్తూంటే తనకుటుంబ సభ్యులతో వీడ్కోలిచ్చాడు ముకుందరావు.

ఆరాత్రి భోజనాలుచేసి నిద్రకుపక్రమిస్తూండగా అసలు విషయం రహస్యంగా ముకుందరావు చెవిలో చెప్పింది అతని భార్య అరుణ. అటంబాంబు పేలినట్లయి గుండె వరకూ కప్పు కొన్న దుప్పటిని కాళ్ళవరకు లాగిపారేసి మంచం మధ్యలో పద్మాసనం వేసి కూర్చున్నాడు ముకుందరావు.

"ఏమిటి అరుణా నీవు చెప్పేది"

"అవునండీ! అందులో నూరు తులాల బంగారమూ, యాభై తులాల వెండి సామాను, ఓ పాతికవేల రూపాయల డబ్బూ ఉందట. అందుకే ఇంట్లో ఉంచి వెళ్ళడానికి భయపడి, ఎవరింట్లో ఉంచనూ నమ్మకం లేక మన ఇంట్లో ఉంచారట. నిన్న కారు బయలుదేరే ముందు రహస్యంగా నాతో చెప్పింది విమల"

ముకుందరావుకు భూమ్యాకాశాలు అతుక్కుపోయినట్లు అనిపించింది. తనింట్లో ఓ వెయ్యిరూపాయలుంచుకోవాలన్నా భయమే. నాగరికత ఎంత అభివృద్ధి చెందుతుందో, అంతకంటె ఎక్కువ మోసాలు, దొంగతనాలు, జరుగుతున్నాయి నిన్నగాక మొన్న ప్రక్కింటి రంగనాయకమ్మ బయటపడుకొని ఉంటే అర్ధరాత్రి దొంగ ఆమె మంచం మీద కాలుపెట్టి, నోట్లో గుడ్డలుకుక్కి రెండు సవర్లు బంగారు గొలుసు లాక్కుపోయాడు. ఆ వీధిలో రోజు కొక దొంగతనం చిన్నదో, పెద్దదో జరిగిందని వింటూనే ఉన్నాడు.

మూల ఉంచిన ఇనప్పెట్టె అతని కంటికి పాముల పుట్టలా కనిపించింది. ముకుందరావు ఇంటి వెనుక చాల ఖాళీస్థలముంది. చిన్న చిన్న పిచ్చి మొక్కలతో, తుమ్మచెట్లతో ఆస్థలం నిర్జనంగా ఉంటుంది.

ముకుందరావు వడివడిగా లేచి అన్ని గదుల తలుపులు పరీక్షచేసి వచ్చి, తన బెడ్‌రూము వెనుక కిటికీ తెరిచాడు. చీకట్లో పిచ్చిమొక్కలు తలలూపుతూ పిలుస్తున్నాయి. తుమ్మచెట్లు చీకటి దుప్పటి కప్పుకొన్న పిశాచాల్లా ఉన్నాయి. జాగ్రత్తగా కిటికీ తలుపులు వేసి అరుణను రమ్మన్నట్లు సైగచేశాడు.

ఇద్దరూ కలిసి ఇనప్పెట్టెను తాము పడుకొనే మంచంక్రింద అడ్డంగాపెట్టారు. దానిమీద ఇంట్లోవున్న చింకి చాపలూ, పాత గుడ్డలూ అన్ని వేసి కనిపించకుండా కప్పేసాడు ముకుందరావు పడుకొన్నాడేగాని నిద్రరాలేదు. పిల్లలిద్దరూ గాఢంగా నిద్రపోతున్నారు భార్యకుకూడా నిద్రపట్టింది. అతనికి లేనిపోని బాధ్యతలు తీసుకొన్నందుకు చుట్ట చుట్టుకొన్న త్రాచుపాము మీద తలపెట్టి పడుకొన్నట్లుంది. ఇక నిద్రెలా వస్తుంది? రాజారావు టూరు నెల రోజులు అన్నాడు. అంటే నెల రోజులు దీన్నికాపాడాలి. తనింట్లో ఇనప్పెట్టిపెట్టడం వీధిలోని వారంతా చూసారు. కనుక జాగ్రత్తగా ఉండాలి అనుకొన్నాడు.

ఆ ఒక్క రాత్రి నిద్రలేనందుకే అతనిముఖం వారంరోజులు తిండి లేనట్లు పీక్కుపోయింది. ఇంట్లో భార్యకు, పిల్లలకు దాని జాగ్రత్తను గురించి అన్ని హెచ్చరికలూ చేసాడు. రోజులు గడుస్తున్నాయి. రోజు రోజుకూ ముకుందరావుకు భయం ఎక్కువవుతూ ఉంది. మనిషి నీరసించిపోయాడు. భర్త పరిస్థితి చూసింతర్వాత ఇనప్పెట్టె కంటే తన భర్త ఏమవుతాడో అనే భయం పట్టుకొంది అరుణకు

"ఏవోయ్ ముకుందం ఏదయినా జబ్బులో పడ్డావా"? ఓ ఫ్రెండ్ అడిగాడు.

"అదేం లేదు బ్రదర్"

"లేదంటావేమిటోయ్! ముఖం పీక్కుపోయింది. కళ్ళు ఎక్కడో ఉన్నాయి. నువ్వు చెప్పకపోయినా అర్థమవుతూ ఉంది. ఏదో సమ్‌తింగ్ జరుగుంటుందని" పరీక్షగా చూస్తూ అడిగాడా మిత్రుడు.

"ఈమధ్య పనులెక్కువయ్యాయిలే. మరి నేనిక వస్తా"

"ఎక్కడికి వెళ్తావ్! రోజూ రాత్రి తొమ్మిది గంటల దాకా ట్రంకురోడ్డులో బాతాఖానీ వేస్తూ మమ్మల్ని నవ్వించేవాడివి. ఇప్పుడు ప్రొద్దుకూకేసరికి ఇంటికి వెళ్లాలంటున్నావ్. ఏమిటి కథ?"

"అయామ్ సారీ! అర్జంటు పని ఉంది. మళ్ళీవచ్చి చెబుతా" అంటూ మరోమాటకు అవకాశమీయకుండా సైకిలెక్కాడు ముకుందరావు.

ఇక ఆఫీసులోకూడా ముకుందరావుకు ఇలాంటి పరామర్శలే ఎదురవుతున్నాయి.

"ఏమిటి ముకుందం మనిషివి సన్నగాఅయ్యావు. ఆరోగ్యం సరిగా లేదా" కొలీగ్ పరామర్శ.

"ఏమిటండీ ముకుందరావు గారూ! ఎప్పుడూ ట్రిమ్‌గా ఉంటూ, డీసెంటు డ్రెస్ వేసేవాళ్ళు. ఆ మాసిన గడ్డమేమిటి? ఆ జుట్టు పెంచడమేమిటి?" స్నేహితుడి బాధ.

"నమస్కారం ముకుందరావు సాబ్! తమరు హప్పుడూ, హప్పుడూ రూపాయి అర్ధరూపాయి టీకి ఇచ్చేవాళ్ళు. ఈమధ్య హేమిటో హేమిటో ఆలోచిస్తా ఉండార్" ప్యూను పీరుసాహెబు ఆవేదన.

"ముకుందరావుగారూ! మీ ఆరోగ్య పరిస్థితిఏమిటో మాకర్థం కావడంలేదు. రోజురోజుకూ పరధ్యానం ఎక్కువయిపోతూ ఉంది. కాగితం వ్రాస్తే అందులో ఒక్క సెంటెన్సూ కంటిన్యూటీ లేదు. నా ఉద్దేశ్యమేమిటంటే, ఇట్ ఈజ్ బెటర్ టు అప్లై లీవ్. మీ-ఆరోగ్యం సరైన తర్వాతనే డ్యూటీలో చేరవచ్చు. ఆరోగ్యమే మహాభాగ్యమన్నారు పెద్దలు. ఆలోచించుకోండి" అన్నాడు ఆఫీసరు ఒకరోజు.

రాజారావు రావడానికి ఇక వారం రోజులే ఉంది. ఒకవేళ సెలవు పెట్టినా బాగుంటుందేమో ఈ వారం రోజులు. ఈ ఆలోచన రాగానే ఆరాత్రి భార్యతో మాట్లాడి సెలవు పెట్టడానికే నిర్ణయించు కొన్నాడు ముకుందరావు. అరుణ పరిస్థితికూడ అలాగే ఉంది. మనిషి చాల తగ్గిపోయింది. మునుపటిలా హుషారుగా ఉండడం లేదు. అయినా ముకుందరావులా స్పర్శజ్ఞానం కోల్పోలేదు.

లీవు అప్లయి చేసినప్పటి నుంచీ ముకుందరావు పగలూ, రాత్రి ఇంట్లోనే గడిపేస్తున్నాడు. పెరిగినగడ్డంతో, తైలసంస్కారం లేని జుట్టుతో దాదాపు పిచ్చివాడయ్యాడు. అతని మెదడులోంచి పాములపుట్ట ఇనప్పెట్టె బయటకు పోతేనేగాని విశ్రాంతి ఉండదు. తెల్లవారే రాజారావు టూర్ నుంచి తిరిగి వచ్చే రోజు.

ఆరోజు సాయంత్రం మార్కెట్‌లో భార్య ఇచ్చిన పట్టీలో కూరగాయలన్నీ కొని రోడ్డునపడి వస్తున్నాడు. ఇంతలో ఎవరో పిలిచినట్లనిపిస్తే ఆగాడు.

ఎదురుగా తన కొలిగ్ నారాయణ. ''ఏం ముకుందం తిరుపతికి వెళ్తున్నావా! గడ్డం పెంచేశావ్. ఫామిలీతోనా, సింగిల్‌గానా! నీ నెరవేరిన కోరికేమిటో నాకూ చెప్పవోయ్" టకటకా అడిగాడు.

"అవునోయ్! తిరుపతికే మొక్కుబడి ఉంది వెళ్ళాలి" ఇక అంతకంటె జవాబు దొరక్క అన్నాడు ముకుందరావు

"ఓహో! అలాగా! సైకిలేదోయ్ నడిచేవస్తున్నావ్"అన్నాడు.

ముకుందరావుకు ఒక్కక్షణం తల తిరిగింది "అరెరె! సైకిలు మార్కెట్‌లోపెట్టి మర్చిపోయివచ్చాను. వస్తా" అన్నాడు వెనక్కు తిరిగి దూసుకుపోతూ.

"ఓరి నీమతి మరుపు మండా, ఇంకెక్కడుంటుంది సైకిలు. అందులోనూ ఈఊర్లో. నామాట విని ముందువెళ్ళి పోలీసు రిపోర్టియ్యి" అన్నాడు నారాయణ.

'నెరవేరిన కోరికేమిట్రా అంటే చెప్పకుండానే వెళ్ళాడు. కొంపదీసి వీడికి ప్రమోషను రాలేదుగదా!' ఈర్ష్యగా అనుకొన్నాడు నారాయణ.

ముకుందరావు నేరుగా మార్కెట్‌దగ్గరకు వెళ్ళాడు సైకిలు అక్కడే ఉన్నందుకు చాల సంతోషించాడు. ఆ రాత్రంతా దైవ ప్రార్థనతో గడిపాడు.

నిద్రలేస్తూనే, "అరుణా త్వరగా కాఫీ ఇవ్వు. రాత్రే రాజారావు వాళ్ళువచ్చి ఉంటారు. ఈరోజుతో ఆపీడ వదిలించుకొందాం" అన్నాడు ఆనందంగా. ఆమెకూ ఆనందంగా ఉంది. వెంటనే కాఫీ తెచ్చిచ్చింది.

ముకుందరావు వెళ్ళేసరికి రాజారావు ఇల్లంతా సందడిగా ఉంది. యథావిధి ఇతనికి సత్కారాలు జరిగాయి. యాత్రా విశేషాలడిగాడు. చెప్పారు. ముకుందరావుని తగ్గిపోయావేమిటనిగాని, గడ్డం ఎందుకు పెంచావని గాని వాళ్ళడగలేదు. ముకుందరావు అసలు విషయానికి వచ్చి ఇనప్పెట్టె తీసుకెళ్ళమని అడిగాడు.

"ఓస్ అదా!....తొందరేముంది. తీసుకెల్తాంలే" అన్నారు.

ముకుందరావు గుండెలో రాయి పడింది. ఇంకేం అనలేక వచ్చేశాడు. తీసుకెళ్ళమని రోజూ అడుగుతూనే ఉన్నాడు. రేపు రేపు అని వాయిదా వేస్తూనే ఉన్నాడు రాజారావు. ఇంకో వారం రోజులు గడిచిపోయాయి

లీవు అయిపోతే ఇంకోవారం ఎక్స్టెండ్‌చేసివస్తున్న ముకుంద రావుని "బాగున్నవా" అంటూ పలకరించాడు ఒక నూతన వ్యక్తి.

"ఎవరు మీరు"

"నన్ను గుర్తుపట్టలేదా ముకుందరావ్! కాలేజీలో నీ క్లాసు మేటుని, హాస్టలులో నీ రూమ్‌మేటుని, ఒకప్పుడు అప్తమిత్రులం"

"ఒరేయ్ విశ్వం" కౌగిలించుకొన్నాడు మిత్రుణ్ని.

విశ్వం తను వ్యాపారం చేస్తూ ఈ వూళ్ళోనే ఉంటున్నట్లు చెప్పాడు. ఇంతకాలం ఎవరికీ చెప్పని ముకుందరావు, తన కడుపు లోని బాధనంతా స్నేహితుని ముందు వెళ్ళగక్కి విమోచన మార్గం చెప్పమని బ్రతిమాలాడు.

విశ్వం ముఖం సీరియస్ అయ్యింది. "వాడు నిజానికి ఏ టూరూ వెళ్ళలేదు. మీరు వీడ్కోలిచ్చిన రోజే మద్రాసు వెళ్ళి రెండు రోజుల తర్వాత వచ్చి డ్యూటీలో జాయినయ్యుంటాడు. వాళ్ళు లేరనుకొన్నావు కాబట్టి నువ్వు వాళ్ళింటికి వెళ్ళలేదు. వాడు

టౌన్లోనే ఉంటూ నీకు కనిపించకుండా తప్పించుకొని తిరుగు తూంటాడు. వాడికి ఇనప్పెట్టెలోని సంపద ఒకసమస్య. అమ్మేస్తా మన్నా, బాంకులో పెడదామన్నా తల్లి ఒప్పుకోదు. భార్య, భర్త వాళ్ళతోబాటు తల్లి జల్సాగా తిరగడానికి అలవాటుపడ్డారు. అటు వంటప్పుడు ఇనప్పెట్టెనుకాపాడ్డం వాళ్ళకొక సమస్య. మనలాంటి బీదవాళ్ళకు అసలు ధనంలేకపోయినా అభిమానధనం ఎక్కువని, మాట నిలబెట్టుకోవడం కోసం ఎంతయినా శ్రమపడుతామని డబ్బున్న మహారాజులకు బాగతెలుసు. అందుకేనీలాంటి, నాలాంటి అమాయకుల్ని మోసంచేసి ఇలా అప్పుజెప్పి హాయిగా ఉంటారు" అన్నాడు.

"ఇలా ఎంతకాలం?" అడిగాడు ముకుందరావు.

"ఎంతకాలమయినా సరే! నీదగ్గరనుంచి ఇనప్పెట్టె తీసు కోడు. కనుక నువ్వే రేపు తీసుకెళ్ళి వాడిది వాడికి అప్పజెప్పు"

"ఇవన్నీనీకెలా తెలుసు" అడిగాడు ముకుందరావు ఆశ్చ రంగా.

"నేనూ నీలాగే ఒకప్పుడు ఇనప్పెట్టె బాధితుడ్ని. దాన్ని వది లించుకొనేసరికి చావుతప్పి కన్ను లొట్టబోయి నట్లయింది"

స్నేహితుడు విశ్వం మాటలు శిరసావహించి మరురోజు ఓ పదిహేను రూపాయలు ఖర్చుపెట్టి ఆటోలో తీసుకెళ్ళి ఇన ప్పెట్టె వాళ్ళకు అప్పజెప్పాడు. అందరూ ఇంట్లోనే ఉన్నారు. అందరూ ముఖాలు చిట్లించుకొన్నారు. ముకుందరావుతో ఎవ్వరూ మాట్లాడలేదు. దానికి బాధపడలేదు, సరికదా తనకా అవస్థ తప్పి నందుకు ఎంతో సంతోషించాడు ముకుందరావు.

ఆరోజు నుంచి ముకుందరావు ఇంటికి, రాజరావు ఇంటికి, రాకపోకలు పూర్తిగా తగ్గిపోయాయి. రాజారావును ఇప్పుడు

ముకుందరావు పలుకరించబోయినా ముఖం చిట్లించి తప్పించుకొని వెళ్ళిపోతున్నాడు.

ఇప్పుడు,

ముకుందరావు ట్రిమ్‌గా డ్రస్ చేసుకొని ఆనందంగా ఉంటూంటే,

ప్రస్తుతం,

రాజారావు ఇంకో మానధనుడివేటలో ఉన్నాడు.



# రెక్కలు తెగిన పక్షులు

పట్నం మందు కొట్టిన కాలేజి అబ్బాయిలా ముస్తాబై ఊగుతూ వుంటే, పల్లెపగలంతా కాయకష్టంజేసి సాయంత్రానికి అలసటగా మంచానికి అడ్డం పడుకున్న శ్రామికుడిలామాగన్నుగా. జోగుతూ వుంది. అలాంటి పరిస్థితిలో నరసయ్య యింటి ముందు చిన్న వాగ్యుద్ధంలాంటిది జరుగుతూ వుంది.

శేషగిరికి ఆరోజు ఉదయమే టెన్త్‌క్లాసు రిజల్టు వచ్చాయి ఫస్టుక్లాసులో పాసయ్యాడు. తాను పై చదువులు చదవాలని పట్టు పట్టాడు శేషగిరి, చదివిన చదువులు చాలు సేద్యంలోకి దిగ మంటాడు తండ్రి నరసయ్య. ఇదీ వాగ్యుద్ధ సారాంశం. ఇద్దరి ఉద్దేశాలు ఒకదానికొకటి చుక్కెదురు. కొద్దిసేపు వాదించి చివ రకు మొండికేసి అలిగి ఓమూల మంచంవేసుకొని పడుకొన్నాడు శేషగిరి. అతన్ని ఎంతమంది బ్రతిమాలినా భోజనానికి రాలేదు.

రాత్రి తొమ్మిదవుతుండగా ప్రవేశించాడు ప్రభాకరం. ప్రభా కరం నరసయ్య పెద్దకొడుకు. ఉండూర్లోనే పంచాయితీ ఆఫీసులో గుమాస్తాగా పనిచేస్తున్నాడు. జీతం నాలుగువందలు ఇస్తారు. ప్రభా కరం టెన్త్‌క్లాసువరకు చదివి ఒకవైపు వ్యవసాయంలో తండ్రికి చేదోడు వాదోడుగా వుంటూ గుమస్తాగా పంచాయితీ లెక్కలు వ్రాస్తూ కాలం గడుపుతున్నాడు. ఊళ్ళోవాళ్ళకు దస్తావేజులు, ఆస్తి అమ్మకం పత్రాలువ్రాసి యింకో నాలుగురూపాయలు సంపా దిస్తాడు. ప్రభాకరానికి ఒక మగపిల్లవాడు సంతానం. భార్య అతని అడుగుజాడల్లోనడిచే సహధర్మచారిణి.

ప్రభాకరం చొక్కావిప్పి వంకీకి తగిలించి, ఇంట్లోని నిశ్శబ్దా నికి కారణమేమిటో తెలియక భార్యను ఏమిటని కళ్ళతోనే ప్రశ్నిం

చాడు. అవన్నీ తరువాత చెబుతాను బావిదగ్గర నీళ్ళుతోడాను వచ్చి స్నానంచేయండి అన్నట్లు సైగ చేసిందామె భర్తకు వీపు రుద్దుతూ విషయమంతా మెల్లగా చెప్పింది. ప్రభాకరం మనసులోనే నవ్వుకొని స్నానంచేసి వుతికినలుంగికట్టుకొని బయటకు నడిచాడు.

ఇంటిముందున్న అరుగుమీద కూర్చొని చుట్టపీలుస్తున్న నరసయ్య కొడుకుని చూడగానే తన వాగ్ధోరణి ప్రారంభించాడు. "చూడరా నీతమ్ముడుచేసే పని. చచ్చి, చెడి మనం ఎండన పడి, మట్టిలో పొర్లాడి ఈ సంసారం అంతంత మాత్రంగా యీడ్చుకొస్తా వుంటే వాడికి చీమకుట్టినట్టుగూడాలేదు, ఏదో అచ్చిరగ్యానం వస్తదిగదా అని నామాట ఇనకుండా వాడ్ని ఇస్కూల్లోజేర్పిస్తిని. ఈడేమో టింగురంగామని కాలేజీలో ఓమ్యే సదవతానంటున్నాడు ఏంది కత?"

''అయితే శేషు కాలేజిలో చేరడానికి నీవు ఒప్పుకోలేదన్న మాట" అరుగుకు ఒకవైపు కూర్చుంటూ అడిగాడు ప్రభాకరం.

"ఒప్పుకొనేదేవిట్రా! మనూళ్లో ఎవురు సదువుకున్నారో చెప్పు. మునసబుకు యాభై ఎకరాలు ఆస్తివుందిగదా. ఒక్కడే కొడుకు. సదివించినాడా. రామిరెడ్డికి ఎంత ఆస్తి వుంది వందెకరాలు. ఆయన తెలివితక్కువవాడయ్యా నలుగురుపిల్లల్ని సేద్యంలోకి దింపింది" ఎగిరిపడ్డాడు నరసయ్య.

ఆయన్ను అంతాచెప్పనిచ్చి ప్రశాంతంగా అన్నాడు ప్రభాకరం ''నాన్నావాళ్ళందరికీ ఆస్తిపాస్తులున్నాయి కనుక వాళ్ళు చదువుకోకపోయినా బ్రతగ్గలరు. మనకేముంది చెప్పు. ఇక ఊళ్లో మిగతావాళ్ళ సంగతంటావా వాళ్ళకు చదువుతో సంబంధంలేదు. చదువు విలువ చెప్పినా అర్థం చేసుకోలేని మూర్ఖులు. నామీద ప్రేమతోనే నాకోరికకు అడ్డుచెప్పలేకనో ప్రక్కూరు హైస్కూల్లో

చేరుతానంటే చేర్పించావు. పరిస్థితులు బాగాలేక స్కూలుఫైనల్‌తో ముగించావనుకో! నాకు చదువు విలువ తెలిసింది. కనుక వాడినే కాదు, వాడి తరువాత నారాయణనుకూడ చదివించాలనేది నా ఉద్దేశం."

''ఏరోయ్! నువ్వు మతుండే మాట్లాడుతున్నావా" తుపుక్కున ఉమ్మేస్తూ అన్నాడు నరసయ్య.

"అవును"

"అయితే డబ్బెట్లా సర్దాలనుకొంటున్నావురా?"

"దానికి ఆలోచించిపెట్టాను ఎప్పుడో''

''ఏందిరా నువ్వు ఆలోచించి పెట్టింది. ఇంట్లో గంపెడు మంది మనుషులున్నారు. వాళ్ళకు కూడెట్లా. తరువాత చెలెలికి పెళ్లెట్లాచేయాలనుకొంటున్నావు. అది గుండెలమీద కుంపట్లా ఎదిగిపోతావుండే. ఇక నెలనెలా చినపిల్లోడి డబ్బావాలు, మీ అమ్మ జబ్బుకు మందులు, నీ పెళ్ళాం కడుపుతో ఉండే అమనిసి కాన్పుకు కర్చెంతవుద్దో ఆలోచించివా. ఇయన్నీ తెలిసే మాటాడుతున్నావాఅంట" చేతిలోనిచుట్ట క్రిందపడేసి, తుండుగుడ్డ భుజానవేసుకొని విసుగ్గాలేచి నిలబడ్డాడు వీధిలోకి వెళ్ళడానికి ఉద్యుక్తుడవుతూ.

"నాన్నా! నేను చెప్పేది పూర్తిగా విను. డబ్బుకు ఇబ్బంది లేకుండా కొన్నిఏర్పాట్లుచేసాను. ప్రక్కవీధి దేవయ్యతాత సంగతి తెలుసుకదా! అతని పాలెగాడు మగతా సరిగా ఇవ్వటంలేదంట. ఈసంవత్సరం ఎవరైనా నమ్మకంగా ధాన్యంతోలేవాడిని చూసి పెట్టమంటున్నాడు. అదినేనేమగతాకు తీసుకొని చేస్తేపోలా! ఆదాయం పెరుగుతుంది కదా"

"ఓరే ప్రభాకరం. అదిఅయ్యేదికాదు పెట్టేదికాదు. మనకుండే సేద్యంగాక ఇంకానా''

"ఫరవాలేదునాన్నా! నేనూ నాభార్య ఎంతశ్రమపడిఅయినా ఇద్దరు తమ్ముళ్ళని చదివించదలచుకున్నాము. ఇక మాటతప్పేది లేదు" నిశ్చయంగా అన్నాడు ప్రభాకరం.

"నీకు నిజంగానే ఇయ్యాల పిచ్చిపట్టిందిరా" అంటూ తువ్వాలు విదిల్చి భుజానవేసుకొని వీధిలోకి వెళ్ళిపోయాడు నరసయ్య.

ప్రభాకరం చిన్నగా నవ్వుకొన్నాడు. 'ఆః మానాన్నకోపం ఎంతసేపులే నేనూ, నా సంసారం ఏమవుతుందనే బాధ తప్పితే ఆయనకి పిల్లల్ని చదివించాలనేఉంది లేకపోతే నన్నుమాత్రం హైస్కూలు వరకూ పంపేవాడా' అనుకున్నాడు.

ముసుగుతన్ని అటు తిరిగి పడుకొనివున్న శేషగిరి, తండ్రి అలా బయటకు వెళ్ళగానే లేచి కూర్చున్నాడు. అన్నవైపు అమి తాశ్చర్యంగా చూసాడు. ఆనందంగానూ చూశాడు.

"ఓరేయ్ శేషగిరీ! లేచి అన్నంతినరా! ఏదయినాఉంటేనాతో మాట్లాడాలిగాని, నాన్న విషయం తెలిసీ నేరుగా ఆయనతో మాట్లా డితే ఎలా"

శేషగిరి ఆనందంగా దుప్పటిలాగి అవతలపారేసి, మంచం మీాదనుంచి దూకి అన్నకాళ్ళద్దుకొన్నాడు.

''ఏమిట్రా? ఏమిటిది??"

"ఏంలేదు అన్నా! నీమీాద ఆధారపడే ఈకుటుంబం జరు గుతుందని నాకు తెలుసు. మనకుటుంబం గానుగెద్దులా నడు స్తుందనీ తెలుసు. ఇలాంటి పరిస్థితుల్లోనువు స్వార్థం వదులుకొని నాకోసం ఇంకా కష్టాల్లోపడబోతున్నావు"

''ఓరేయ్! చదువు విలువ నాకు తెలుసురా. ఇంట్లో ఒకడు చదువుకొన్నవాడుంటే మిగతావాళ్ళకు ప్రోత్సాహముంటుందిరా. మనకుటుంబం తరతరాలనుంచి దారిద్ర్యంలో మునిగితేలుతూ వుంది. ఇప్పటికయినా మనం చిన్న చిన్న ఉద్యోగాలు సంపా

యించుకొని. మనవెనకవాళ్ళని పైకితీసుకొస్తే కుటుంబం అభివృద్ధిలోకి వస్తుంది" ప్రభాకరం కళ్ళలో తడి.

అన్న త్యాగానికి శేషగిరి కరిగిపోయాడు.

శేషగిరి కాలేజీలో చేరాడు. అతని ఫీజులకు పుస్తకాలకు బట్టలకు దాదాపు వెయ్యిరూపాయలు అప్పుచేయాల్సి వచ్చింది. ఐనా ప్రభాకరం ఏమీ బాధపడలేదు. దేవయ్య తాత నాలుగెకరాలూ కౌలుకుతీసుకొన్నాడు. సేద్యంలో పూర్తిగా మునిగిపోయాడు. ఇప్పుడు ఒక్క క్షణం అతనికి తీరికలేదు. నరసయ్య, తమ్ముడుమీద ప్రేమతో ప్రభాకరంచేసిన నిశ్చయం చివరకు ఎలా పరిణమిస్తుందోనని భయంగావుంది. చదువుకొనంగానే ఉద్యోగం వస్తుందా అనేది అతని అనుమానం. ఇలా చదువుకోసం అనవసరంగా డబ్బు పెట్టేకంటే, తనూ ముగ్గురు కొడుకులు సేద్యంలోకి దిగితే ఎంతో డబ్బు సంపాదించేవాళ్ళంకదా అనుకొంటాడు.

ప్రభాకరం భార్యకు కాన్పుఅయింది. కొడుకును ప్రసవించింది. కాన్పుకు కొంత ఖర్చయింది. ఉత్తరంచూసుకొని పరుగెత్తుకొచ్చాడు శేషగిరి పట్నంనుంచి. తనఖర్చుకు ఇచ్చిన డబ్బుల్లో మిగిల్చి పిల్లవాడికి రెండు రెడీమెడ్‌చొక్కాలు, వదినకు రెండు జాకెట్లు తెచ్చాడు. డబ్బు ఖర్చుపెట్టి సరిగా తినక చిక్కిపోయాడని, ఇలా మిగిల్చి బట్టలు కొనక్కురావడం దేనికని వదినా, అన్నా చీవాట్లేసేరు.

శేషగిరి ఇవేమీ పట్టించుకోలేదు తనకు వదినమీదా, అన్నమీదావున్న అభిమానం అటువంటిది. వున్నవారంరోజుల్లోనూ అన్నకొడుకుని వదల్లేదు. చివరకు ప్రభాకరం బలవంతంమీద చిన్నపిల్లవాడ్ని వదల్లేక కళ్ళ నీళ్ళుపెట్టుకొని బయలుదేరాడు. అన్నా, వదినలు తనకోసం ఎంత శ్రమిస్తున్నారు అనుకొన్నాడు.

ప్రభాకరం చెల్లెలును చూడడానికి పట్నంనుంచి పెళ్ళి చూపులకు వచ్చారు, అబ్బాయి కలెక్టరాఫీసులో ఉద్యోగం చేస్తున్నాడు. జీతం రెండువేలు వస్తుంది. ఇకనేం ప్రభాకరంకు నచ్చాడు. నరసయ్యకుమాత్రం ఇష్టంలేదు. "ఒరేయ్ పట్టణాల్లో మోసం ఉంటుందిరా. పిల్లను మనూర్లో ఎవడో ఒకడికి సేద్యం చేసుకొనేవాడికి ఇద్దాం" అన్నాడు.

ప్రభాకరం ససేమిరా ఒప్పుకోలేదు. కుటుంబాన్నంతా బీద రికపు పంజరంలోంచి విడిపించి ఒక స్థాయికి తీసుకురావలని అతని కోర్కె. అందుకే చదువుకొన్నవాళ్ళతో సంబంధాలు పెట్టుకోవాలి. ఈ ఉద్దేశ్యంతోనే ఈ పెళ్ళి ఎలాగయినా చేయాలని నిశ్చయించుకొన్నాడు. అయితే వాళ్ళడిగిన కట్నాలకు ఇంట్లోని అందరి గుండెల్లో రాయిపడింది.

విషయం తరువాత చెబుతామని వాళ్ళని సాగనంపాడు ప్రభాకరం. తరువాత ఇంట్లో తర్జనభర్జనలు మొదలయ్యాయి.

"ఒరేయ్ ప్రభాకరం నేను చెప్పాను గదరా ఇది మనకు కుదర్దని. ఇక నోర్మూసుకొని పడివుండండి. రేపు ప్రక్కూరు సుబ్బయ్య, కొడుకుతో పిల్లనిచూడ్డానికి వస్తాడంట. అంతో ఇంతో పొలంపుట్రా వున్న వాళ్ళు. వాళ్ళ సాంప్రదాయంకూడా చాల మంచిది. ఈ సంబంధం ఖాయంచేస్తా"

"నాన్నా! నీ ఆవేశమే నీదికాని ఆలోచించవుకదా!!" అంటూ దొడ్లో కూరపాదులకు నీళ్ళు తోడిపోస్తున్న భార్య దగ్గరకు వెళ్ళి కొద్దిసేపు మాట్లాడాడు. అన్నిటికీ తలఊపింది అతని భార్య.

"నాన్నా! మనంకేం భయంలేదు. దిగువ కయ్యి ఒక ఎకరం అమ్మేస్తాం" అన్నాడు తిరిగివచ్చి ఆనందంగా.

"ఏమిట్రా నువ్వనేది. మీమామగారు పసుపు కుంకుమల క్రిందిఇచ్చిన రెండెకరాల్లో ఎకరా అమ్మేస్తావూ! ఏంచెడ్డరోజు

లొచ్చాయిరా" అరిచాడు. తల్లి మనవడ్ని భయంతో గుండెలకు హత్తుకొంది.

"ఎందుకు నాన్నా! అంత భయపడుతారు. నాభార్య అంగీకారంతోనే దీన్ని అమ్ముతున్నా. ఆమెకు తమ్ముళ్ళంటే ఎంతో అభిమానం" ఏమాత్రం చలించకుండా అన్నాడు ప్రభాకరం

"నువ్వేన్నయినాచెప్పు. దీనికి నేను ఒప్పుకోను" అంటూ ఎగిరిపడ్డాడు నరసయ్య. కళ్ళనీళ్ళు ఒత్తుకొంది ప్రభాకరం తల్లి.

తండ్రితో సంబంధంలేకుండా ఆ ఎకరం అమ్మేసి డబ్బు రెడీచేసి పెట్టుకొని, తాము అనుకున్న కట్నం ఇవ్వడానికి సిద్ధమని, వచ్చి నిశ్చయతాంబూలాలు పుచ్చుకొని వెళ్ళమని ఉత్తరం వ్రాశాడు. తమ్ముణ్ణికూడా రమ్మని వ్రాసాడు.

శేషగిరి లబోదిబోమని కొట్టుకున్నాడు జరిగినదానికి. 'చిన్న పిల్లల్ని దిక్కులేనివాళ్ళని చేస్తున్నావుఅన్నా'-అని ఏడ్చాడు. "వదినా! నీ మెతకతనంచూసే అన్న ఇన్ని అక్రమాలు చేస్తున్నా డ"ని వదినమీద నిష్ఠూరపడ్డాడు. నేను సంపాదించి వదినకు ఆ ఎకరం పొలం కొనిపెడతానని తల్లిదండ్రులముందు ప్రతిజ్ఞ చేసాడు.

ప్రభాకరంకు, అతని భార్యకు ఎకరంపొలం అమ్మి చెల్లెలు పెళ్ళి చేసినందుకు బాధపడకపోగా శేషగిరి అభిమానానికి పొంగిపోయారు. అన్నాతమ్ముళ్ళ అనుబంధం ఇదేనేమో అనుకున్నాడు ప్రభాకరం.

పెళ్ళి నిర్విఘ్నంగా జరిగిపోయింది. చెల్లెలి జీవితంలో కాంతులు వెదజల్లాలని ఆనందించాడు ప్రభాకరం.

సంవత్సరాలు గడుస్తున్నాయి. శేషగిరి ఇంటర్‌మీడియట్ పూర్తిచేసి కాలేజీలో డిగ్రీచేరేసరికి ప్రభాకరం రెండవ తమ్ముడు

నారాయణ టెన్తుపాసయ్యాడు. ప్రభాకరం ఏమాత్రం వెనుకంజ వేయకుండా నారాయణనుకూడా పట్నం కాలేజీలో చేర్పించాడు. రోజులు గడుస్తున్నాయి. ప్రభాకరం అనాలుగెకరాలేగాక వేరే చోట రెండెకరాలుకూడా కౌలుకు తీసుకొన్నాడు.

పంచాయితీ ఆఫీసులో మంచితనంమీద నలుగురూ కొంత సహాయం చేసేవారు. నిరంతరశ్రమతో ప్రభాకరం చాల తగ్గిపోయాడు. అతని భార్య ఆరోగ్యస్థితికూడా ఏమంత బాగుండేది కాదు. తల్లిదండ్రులకుకూడా వయసు వచ్చేసింది. ఇంతకుముందులాగ నరసయ్య సేద్యపుపనుల్లో పాల్గొనలేకపోతున్నాడు. ఇప్పుడు కుటుంబభారమంతా ప్రభాకరం అతని భార్యమీదపడింది.

శేషగిరి డిగ్రీపూర్తిచేసి ఉద్యోగంవేటలోఉండే సమయానికి, చిన్నతమ్ముడు నారాయణ డిగ్రీ ఫైనలియరులోకి వచ్చేసరికి భార్య ఆస్తిలో రెండవ ఎకరంకూడా అమ్మేసాడు. అన్న ఆర్థిక పరిస్థితి తెలిసిన నారాయణ "ఉమ్మడి ఆస్తిలో తాను భాగానికి రానని, తనభాగం అన్నకే చెందుతుందని" తీర్మానంచేసాడు. శేషగిరికి మంచి ఉద్యోగం దొరికింది.

దీంతో మొదట సంతోషించింది ప్రభాకరం. తన ఇద్దరు పిల్లలు ప్రస్తుతం హైస్కూల్లో చదువుతున్నారు. వాళ్ళహైస్కూలు చదువు పూర్తికాగానే శేషగిరి నారాయణ తన పిల్లల్ని చెరొకరు కాలేజీ చదువు చదివిస్తే తనకు హాయిగాఉంటుంది అనుకొన్నాడు.

శేషగిరి తన జీతంలోంచి నెలనెలా కొంత పంపిస్తున్నాడు. దీంతో కాపురం సరిచేసుకొందామనుకొన్నారు. కాని రెండు నెలలు గడిచేసరికి శేషగిరికి మంచిసంబంధాలు రావడం మొదలయ్యాయి. శేషగిరి తాను కాపురం ఒక కొలిక్కివచ్చేదాకా వివాహంచేసుకోనన్నాడు. నరసయ్యకువాళ్ళు ఇస్తామన్న కట్న కానుకలు

వింటూంటే నోరూరింది. పెద్దకొడుకుకూడా పెళ్ళిచేసేద్దాం అన డంతో శేషగిరిని ఎలాగో ఒప్పించి పెళ్ళిచేసేశారు. శేషగిరి మామ గారు తాను కట్నం క్రింద ఇస్తానన్న యాభైవేలు కూతురిపేరిట బ్యాంకులో డిపాజిట్‌చేసి పాసుబుక్కు మాత్రం ఇచ్చాడు.

శేషగిరి వివాహంఅయింతర్వాత పట్నంలో కాపురంపెట్టాడు. క్రమేణా ఇంటికి డబ్బులుపంపడంకూడా మానుకొన్నాడు. కాపురం పెట్టినతర్వాత ఖర్చులు ఎక్కువయ్యాయని జీతం చాలడంలేదని జాబు వ్రాసేవాడు. ప్రభాకరం దేనికీ చలించలేదు. పెద్దకొడుకు టెన్తు పాసుకాగానే తమ్ముడు తనదగ్గర వుంచుకొని కాలేజి చదువు చదివిస్తే చాలు అనేది అతని కోరిక.

అతని అదృష్టమో మరేమోగాని, నారాయణకు రిజల్ట్సు వచ్చిన రెండు నెలలకే అతనికి బ్యాంకులో ఉద్యోగమొచ్చింది. విజయవాడకు పోస్టుకుచేస్తే అక్కడకు వెళ్ళిపోయాడు. ఉద్యో గంలో చేరిన మొదటినెలలోనే అతను ఇంతకుముందు కాలేజీలో ప్రేమించిన తనకులంకాని అమ్మాయిని వివాహం చేసుకొన్నానని తనను క్షమించమని తండ్రిని, అన్నను కోరుతూ జాబు వ్రాసాడు.

ఇన్ని మార్పులు సంసారంలో వచ్చినా ప్రభాకరం అధైర్య పడలేదు. అతని భార్యకుమాత్రం ఎక్కడో బెరుకు బెరుకుమంటూ వుండేది. భార్యకు ధైర్యంచెప్పేవాడు. ప్రభాకరం తల్లిదండ్రులు పూర్తిగా ముసలివారైపోయారు. ఏపనీ చేయలేని స్థితిలో ఉన్నారు.

టెన్త్‌క్లాసు స్టేటు ఫస్టు వచ్చాడు ప్రభాకరం పెద్దకొడుకు. వాడ్ని తీసుకొని శేషగిరి దగ్గరకు వెళ్ళాడు ప్రభాకరం. శేషగిరి అన్నిహామీలు యిచ్చి వాడ్ని కాలేజీలో చేర్చాడు. కాలేజీలోచేరిన పదిరోజులకే పిన్నమ్మ వెళ్ళిపొమ్మన్నదంటూ వాడుతిరిగివచ్చాడు.

విచారించడానికి వెళ్ళిన అన్నతో తమ్ముడు శేషగిరి, తనకు యింట్లో ఏఅధికారమూలేదని, జీతంఅంతా భార్యకు యివ్వా

లని, భార్యకు వాడువుండడం ఇష్టంలేదని, వాడికి ఖర్చుపెట్టడం ఇష్టంలేదనిచెప్పాడు. తానేమీచేయలేని నిస్సహాయుడ్నిచెప్పాడు. దాంతో రెండవ తమ్ముడికి జాబువ్రాస్తే అతనేమీ జవాబివ్వలేదు.

ఆ వూర్లోనే టీచరుగా పనిచేస్తున్న పరమేశం, ప్రభాకరం పరిస్థితి అర్ధంచేసుకొని ఓదార్చాడు. పెద్దపిల్లవాడికి మెరిట్‌స్కాలర్ షిప్పుతో చదివే ఏర్పాటుచేశాడు. రెండవవాడి విషయంలోకూడా తాను అండవుంటానని చెప్పాడు. దాంతో స్థిమితపడ్డాడు ప్రభాకరం.

రోజులు గడిచిపోతున్నాయి. ఒకరోజు ప్రభాకరం, అతని భార్యా పొలం పని చూసుకొని యింటికి వచ్చేసరికి, ఇద్దరు తమ్ముళ్లు, వాళ్ళ భార్యలూ వచ్చి వున్నారు. ప్రభాకరానికి ఎంతో ఆనందం వేసింది. అందరినీ పేరుపేరునా పలుకరించి యోగ క్షేమాలు కనుక్కొన్నాడు. ప్రభాకరం భార్య వాళ్ళ అందాల్ని, వాళ్ళు కట్టిన విలువైన బట్టల్ని, వాళ్ళ చదువుల్ని వూహించి ఎంతోజాగ్రత్తగా మసలుకోసాగింది. చిరుగుల రవికను. పాతచీర కొంగుతో కప్పుకొని వంటపనిలో అత్తగారికి సాయంచేసింది. ఆమెకు వాళ్ళతో మాట్లాడాలంటే భయంగా వుంది. 'వదినా బాగున్నావా' అని ఒక్కమాటకూడా అనని మరుదులు గుర్తుకొచ్చి కొద్దిగా బాధపడింది

నరసయ్య తన కొడుకులూ, కోడళ్ళు పలుకరించినా పలుకలేదు. మొదటివాడు భార్యా విధేయుడని రెండవవాడు చేసినమేలు మరచిపోయిన దుర్మార్గుడవి, తన అనుమతి లేకుండా పెళ్ళిచేసు కొన్నాడని అతని బాధ. తన కుటుంబాన్ని, పెద్దకొడుకు చేసిన మేలును మరిచిపోయాడనేది అతని ఆవేదన.

సెలవుల్లో ఇంటిదగ్గరేఉన్న ప్రభాకరం కొడుకులు బాబాయిల్ని ప్రేమతో పలుకరించాడు. పిన్నమ్మల యోగక్షేమాలు

ఎంతో అభిమానంతో అడిగారు. వాళ్లుఅంటీ ముట్టనట్లు మాట్లా డారు. ఎక్కడచదువుతున్నారనిగాని ఏమి చదువుతున్నారనిగాని అడగలేదు బాబాయిల విషయం అలాగ ఉంటే పిన్నమ్మలు కూడా ముభావంగానే వ్యవహరించారు.

ఎప్పుడో పెళ్ళయిన క్రొత్తలోవచ్చిన పెద్దతమ్ముడు, పెళ్ళైన తరువాత భయపడిరాని చిన్నతమ్ముడు ఒక్కసారిగా వచ్చేసరికి ప్రభాకరానికి చెప్పలేనంత ఆనందంగా ఉంది. ఆ రోజు విందుబోజనాలు అర్భాటంగా చేసాడు మధ్యాహ్నం భోజనాలు అయిన తర్వాత అసలు విషయం కొద్దికొద్దిగా బయటకు రాసాగింది, వాళ్ళ భార్యలద్వారా.

ఆరోజు సాయంత్రం పంచాయితీబోర్డు దగ్గరకు పెద్దమనుషులు నరసయ్యను, అతని ముగ్గురుకొడుకులను పిలిపించిన తర్వాతగాని అసలు విషయం అర్ధంకాలేదు. పూర్తిగా అర్ధమయిన ప్రభాకరానికి కళ్ళు తిరుగుతున్నట్లయింది. తమ్ముళ్ళువచ్చి ఏదో ఆనందం కలిగిస్తారనుకొంటే చివరకు దుఃఖం మిగిల్చారు. వాళ్ళు ఆరోజు ఉదయం తండ్రితో విషయం చర్చించే ధైర్యంలేక ఆస్తిలో భాగాల్ని పెట్టమని ఊళ్లోని పెద్ద మనుషుల్ని కోరారు.

పెద్దమనుషులముందే తన ఇద్దరు కొడుకుల్ని ఛడామడా తిట్టాడు నరసయ్య. ప్రభాకరం ప్రక్కనేవున్న మొండిగోడనానుకొని క్రిందకూర్చొన్నాడు. పుల్లతో తలపంచుకొని నేలమీద గీతలు గియ్యసాగాడు. నరసయ్యేగాక పెద్దమనుషులుకూడా తమ అన్న చేసిన త్యాగం గుర్తుచేసి, కొంతకాలమయినా ఉమ్మడిగా ఉండమని, ఈలోపల వాళ్ళ అన్నచేసిన అప్పులు తీరిపోతాయని చెప్పి చూసారు. కాని వాళ్ళు వినలేదు. పెద్దమనుషులు సమస్య పరిష్కరించకపోతే కోర్టుకుపోవాల్సి వస్తుందని చెప్పారు.

ఇంతలో ప్రభాకరం లేచి 'ఇంటిపరువు తీయాల్సిన అవసరంలేదని ఆస్తి పంపకం తనకిష్టమేనని' తెగేసి చెప్పాడు. తరువాత నరసయ్య తన మామూలు ధోరణిలో "ఒరే నీకు పిచ్చిగాని పట్టలేదుకదా మనంఅడుక్కుతినాల్సి వస్తుందిరా" అని అరుస్తున్నా వినిపించుకోలేదు. ఆస్తి పంపకం జరిగింది. ముగ్గురుకొడుకులకూ మూడెకరాలు, నరసయ్యకు అతని భార్యకూ కలిపి ఒక భాగంగా ఎకరాపొలం వచ్చింది. నరసయ్య పెద్దకొడుకుదగ్గరే ఉండిపోతానన్నాడు. ఇల్లు మాత్రం పంపకం జరగలేదు.

మరుసటిరోజు ఉదయం చేతుల్లో వి. ఐ. పి సూటుకేసులతో తమ్ముళ్లు, భుజానికి తగిలించుకొన్న హాంకుబాగులతో మరదళ్ళు నవ్వుకొంటూ కబుర్లు చెప్పుకొంటూ ఆనందంగా వెళ్ళిపోతూంటే ప్రభాకరం మిగతా కుటుంబసభ్యులు చూస్తూ ఉండిపోయారు.

ప్రభాకరం తనకు అటూ ఇటూ నిలబడివున్న పిల్లలిద్దరినీ ఒకసారి తేరిపారచూసాడు 'నేను యిలాంటి పనిచేయను' అని హామీయిస్తున్నట్లు చిన్నకొడుకు పెద్దకొడుకు చేయిపట్టుకొని వున్నాడు. గుమ్మందగ్గర నిలుచునివున్న ప్రభాకరంభార్య అదృశ్యం చూడలేక చలించి నోట్లోపైటకుక్కుకొని ఏడుస్తూ లోపలికి వెళ్ళిపోయింది.

గూట్లో పిల్లలకు ఆహారంతెచ్చి ముక్కుతో వాటికందించే తల్లిపక్షికి, అవే రేపు రెక్కలొచ్చిం తర్వాత తనకు కాబోయే ఆహారాన్నికూడా తన్నుకుపోతాయని తెలియదు. శేషగిరి, నారాయణ రెక్కలొచ్చి ఎగిరిపోతే ప్రభాకరం, అతని బార్య రెక్కలు తెగి, నేలకు కూలిపోయారు.

*

# సొంత ఇల్లు - అద్దె కొంప

మా ఆఫీసు యూనియన్ ఎలక్షన్లు ఇక పది రోజులే ఉన్నాయి. అత్యంత కీలకమైన ప్రెసిడెంటు పదవికి మా ఆఫీసులో ఇద్దరి మధ్య తీవ్రమైన పోటీ జరుగుతోంది.

"చూడండి జగన్నాథంగారూ! ప్రెసిడెంటు పదవిచేసేవాడికి సాధకబాధకాలు తెలిసి ఉంటేనే తప్ప తోటి ఉద్యోగుల సంరక్షణకు పోరాడలేడు. నేను అందరిలో కలిసిపోయి అందరి బాధలూ నావిగా భావించే వాడిని. ఆ సొంత ఇంటి సుబ్బారావు కేమండి అంతో ఇంతో స్థిరాస్తి కలవాడు. ఎవరు ఎలాపోతే నాకేం, పద వుంటే చాలు అనే రకం. కనుక మీరూ, మీ అనుయాయులూ నాకు ఓట్లు వేసి నన్ను గెలిపించండి." రెండు చేతులెత్తి నమస్కరిస్తూ అన్నాడు అద్దెఇంటి అప్పారావు.

అద్దెఇంటి అప్పారావు అలా మా సెక్షను దాటగానే, ఇలా సొంతఇంటి సుబ్బారావు ప్రవేశించాడు. ప్రతిఒక్క సీటు దగ్గరకూ వెళ్ళి తన ఉపన్యాసాన్ని వినిపిస్తూ చివరగా కూర్చునిఉన్న నాదగ్గరకు వచ్చాడు.

"అప్పారావు తన ఆరాటన్నంతా తమ ముందు వెళ్ళబోసుకొని ఉంటాడను కొంటాను. నేను ఉద్యోగస్థుల సాధక బాధకాలు తెలియని భాగ్యశాలిననీ. సొంత ఇల్లుగల ధనవంతుడిననీ, తాను అద్దె కొంపలో ఉంటూ తోటి ఉద్యోగస్థుల సాధకబాధకాలు ప్రత్యక్షంగా తెలుసుకొనే నిజాయితీపరుణ్ణనీ కోతలుకోసి వెళ్ళిఉంటాడు."

కొద్ది సేపు ఆగి ఊపిరి పీల్చుకొని అన్నాడు.

"ప్రెసిడెంటు హోదాకు అవసరమైన క్వాలిఫికేషను మాటలు చెప్పడమా లేక కర్తవ్య నిర్వహణా?" అన్నాడు.

"కర్తవ్య నిర్వహణే" అన్నాను.

"ఎస్. మీరే ఒప్పుకొన్నారు. అది నాకుంది. కనుక మీ తరపు ఓట్లన్నీ నాకే వేయాలి ఇక సెలవు తీసుకుంటాను" నమస్కారాలమీద నమస్కారాలు పెడుతూ వెళ్ళాడు సొంత ఇంటి సుబ్బారావు.

నేను అసిస్టెంటు సెక్షన్ హెడ్‌ని అయి ఉండడంవల్లనయితే నేమి నేను ప్రాక్టికల్‌గా ఆలోచించడం వల్లనయితేనేమి నేనేగాక నామాటమీద ఇంకో పదిఓట్లు పడతాయని ఇరువర్గాల్లోనూ నమ్మకముంది

సదా అద్దెఇళ్ళలోని బాధలను వర్ణిస్తూండడంవల్ల అప్పారావుకు అద్దెకొంప అప్పారావని, సొంత ఇల్లు కట్టించి నప్పటి నుంచీ సుబ్బారావులో ఒకరకమైన మార్పురావడంతో అతన్ని సొంత ఇంటి సుబ్బారావని పిలవడం మాకు మామూలైపోయింది. నేను ఫైలు మూసి ఆలోచించ సాగాను.

ఎవరెన్ని చెప్పినా నాదృష్టంతా అద్దెకొంప అప్పారావుమీదే ఉంది. కారులో పోయేవాడికంటే ఎండలో నడిచేవాడికి ప్రయాణం లోని శ్రమ తెలుసు. సొంత ఇంటి సుబ్బారావుకంటే అద్దె ఇంట్లో ఉన్న అప్పారావుకే ఎక్కువ కష్టాలుండటం సహజం. అలాకష్టాలు పడేవాడేతోటి వాడి కష్టాలు అర్థం చేసుకోగలడు.

కాని సొంత ఇంటి సుబ్బారావు వెళుతూ వెళుతూ అన్న దాంట్లోకూడా కొంత లాజిక్ ఉంది. కావలసింది మాటలా కర్తవ్యమా? అన్నాడు. అదీ నిజమే! కొంతమంది మాటల్లో చెప్పినంత ఫోర్సు ప్రాక్టికల్‌గా ఉండదు. ఏదిఏమైనా ఉద్యోగస్తుల రక్షణ కోసంపాటు పడేవాడు మాకు ప్రెసిడెంటుగా ఉండాలి. వీళ్ళల్లో ఎవరు ఎంతవరకు అన్నది ప్రాక్టికల్‌గా టెస్ట్‌చెయ్యాలనుకొన్నాను

నేను ఆ ఆదివారం అద్దెకొంప అప్పారావింటికి బయలు దేరాను. అప్పారావు చెప్పిన స్టాపులో బస్సు దిగి సందు మలుపు తిరిగాను. తరువాత అక్కడినుంచి పోస్టాఫీసు దాటి, కుడివైపుగా నడచి నాలుగవ ఎలక్ట్రిక్ స్తంభం దాటాను. ఎదురుగా విరిగి పోయిన ప్రహరీగోడ లోపల వరుసగా షెడ్డుల్లాఉన్న ఆరు రేకుల ఇళ్ళున్నాయి.

ఇంతలో అక్కడినుంచి వస్తూ ఓ పాతికేళ్ళ యువకుడు ఎదురయ్యాడు.

"అప్పారావు ఏ ఇంట్లో ఉంటున్నాడండీ?" అనడిగాను.

"ఎవరూ ...అప్పారావా? వాడిక్కడెందు కుంటాడండీ? ముష్టివెధవ ప్లాటుఫారం మీదుంటాడుగాని!"

"ఆయన ముష్టివెధవ కాదండీ! మా ఆఫీసు సీనియర్ అసిస్టెంటు. మేమంతా అతన్ని అద్దెకొంప అప్పారావని అంటూం టాము"

"ఏమో ఎవడికి తెలుసు?" అంటూ వెళ్ళిపోయాడు.

ఇంతలో ఎవరిదో చెయ్యి భుజంమీద పడింది. 'ఇక్కడ కూడా జేబుదొంగ లున్నారా బాబోయ్' అనుకుంటూ భయపడ్డాను. కాని, ఆచేయి సాక్షాత్తూ నేవెతుకుతున్న అద్దెకొంప అప్పారావుది.

"రక్షించావు గదయ్యా. ఇప్పటివరకూ మీఇంటికోసమే వెతుకుతున్నాను"

"నేను చెప్పాను గదా జగన్నాథంగారూ, నేరుగా రాలేక పోయారా?"

"ఇదుగో అప్పారావ్. ఏవో ఎలక్షన్లుగదాని నాకు గారూగిరూ చేర్చి మాట్లాడకు. ఎప్పట్లా జగన్నాథం అని పిలువు చాలు" అన్నాను.

నాబాధ అర్థంచేసుకొన్న అప్పారావు "అలాగే అలాగే" అంటూ తల ఊపాడు.

"ఇప్పుడు ఇటుగా వెళ్ళిన ఆ అబ్బాయెవరు?" అనడిగాను.

"వాడా? ఏం" ప్రశ్నించాడు.

"అప్పారావు ఇల్లెక్కడని అడిగితే ప్లాటుఫారంమీద ముష్టడుక్కొంటున్నాడని చెప్పాడు"

"వాడు నా సుపుత్రుడులే! వాడి పేరుకూడా అప్పారావే. వాడు నిరుద్యోగి. ఆ కడుపుమంటతో వాడు తన్ను తాను అలా పరిచయం చేసుకొని ఉంటాడు. రా వెళదాం ఇంట్లోకి" అంటూ ఆహ్వానించాడు.

ఇద్దరం ఇంట్లోకి వెళ్ళాము.

"కాఫీ తయారుచెయ్ వెంటనే" అంటూ తనచేతిలోని కూర కూరగాయల సంచీ భార్యకు అందించాడు.

పది నిముషాల్లో ఇద్దరికీ రెండు స్టీలు గ్లాసుల్లో కాఫీలు వచ్చాయి. ఒకదానికి అడుగు లోపలికి అతుక్కుపోయి ఉంది. ఇంకొకదానికి ఒకవైపు సొట్టపోయి ఉంది. 'పీడపిండాకూడు. వీడెంత పిసినారి! అఖరుకి రెండు శుభ్రమైన స్టీలుగ్లాసులు కొనేశక్తికూడా లేదా?' అనుకొన్నాను.

''జాగ్రత్తగా వంగు" అన్నాడు గ్లాసు కిందపెట్టబోతుంటే.

"ఏం?" అన్నాను ఆశ్చర్యంగా.

"కుర్చీ...."

అప్పారావు కుర్చీవైపు చూశాను. దానికి మూడుకాళ్ళే ఉన్నాయి. వెనుకవుండవలసిన రెండు కాళ్ళలో ఒకటే వుంది. అయినా అప్పారావు బ్యాలన్సు మీద చాలాఫ్రీగా కూర్చుని ఉన్నాడు.

"నేను చెప్పేది నీ కుర్చీ గురించి" అన్నాడు.

ఆటంబాంబు పడ్డట్లు దూరంగా వెళ్ళి నేకూర్చున్న కుర్చీ వైపుచూశాను. దానికి రెండేకాళ్ళున్నాయి. గోడకు అనించి ఉండడం వల్ల కదలడం లేదు.

"ఇప్పుడే ఏం చూశావ్? ఇంకా చూడవలసినవి చాలా ఉన్నాయి. మధ్యాహ్నం భోజనానికి ఉండు" అన్నాడు.

"ఎందుకులే అప్పారావ్! నేను నీ అహ్వానాన్ని కాదనలేక ఇల్లు చూద్దామని వచ్చానుగాని...."

"నో....నో....రాక రాక వచ్చావు. ఉండక తప్పదు" అన్నాడు ప్రాధేయపడుతూ.

బలవంతం క్షణక్షణానికి ఎక్కువవుతుందని గమనించి "అలాగేలే" అన్నాను.

అప్పారావు అద్దె ఇంటిలోని బాధలన్నీ చెప్పుకొచ్చాడు. ఇంటికి వెల్లవేసి ఎన్నో దశాబ్దాలైనట్లు ఉంది. మొహెంజదారో, హరప్పాలలోని సింధు నాగరికతను తెలియజేస్తున్నాయి గోడలు. ఏమిటేమిటో బొమ్మలు, ఎవరెవరివో పేర్లు గోడలమీద చెక్కబడి ఉన్నాయి. ఆనాటి లలిత కళలను చాటి చెబుతున్నట్లు.

నా చూపులు గమనించి "మేము వెళ్ళేటప్పుడుకూడా మాకు తగ్గ ప్రావీణ్యం చూపించి మరీ వెళతాం" అన్నాడు.

"అదేం?"

"ఓనరుగాడి(ద) మీద కోపం. మేమూ తగిన నష్టంచేసి వెళతాం."

"ఎందుకని?" అన్నాను మళ్ళీ.

"ఇల్లంటూ ఒకటిచ్చి ఏడ్చాడేగాని ఎప్పుడైనా దానిబాగోగులు చూశాడా? ఇంటికి వెల్లవేయించుకోవడం, పంపుచెడిపోతే

రిపేరుచేయించుకోవడం ...ఇవన్నీ మేమే చేసుకోవాలా? ఇంటిఅద్దె మాత్రం తీసుకుపోవడానికి ఠంచనుగా హాజరు!"

"అన్నిచోట్లా అంతేలే"

"అవునవును జగన్నాథం! ఇల్లుగల ప్రతిఒక్కడూ తానేదో దేవలోకంనుంచి వచ్చినట్లు భ్రమిస్తుంటాడు. అద్దె కొంపలో ఉన్న వాణ్ణి ఒక బానిసలా చూస్తాడు. నన్నడిగితే దేశంలో ఉండేది రెండే రెండు తరగతులు. ఒకటి సొంత ఇల్లుగలవాళ్ళు. రెండు అద్దె కొంపల్లో ఉండేవాళ్లు. ఈ రెండు వర్గాల పోరాటమే తర తరాలుగా జరిగేది"

"ఆకాశవాణి విజయవాడ కేంద్రం. ఇప్పుడు మీరు వార్తలు వింటారు."

ఆ గదిలో ఎదురుగా టేబులుమీదున్న రేడియో నే వచ్చిన ఈ ఇరవై నిముషాల నుంచి నిశ్శబ్దంగా ఉంది. ఒకవేళ సడన్‌గా కరెంటు వచ్చిందేమో అని అనుకొందామంటే అదికూడా కాదు. ప్లగ్ వేరుచేయబడి ఉంది. ఒకవేళ బ్యాటరీతో పనిచేసినా ఎవరైనా స్విచ్ ఆన్ చేయాలికదా!, 'నామిత్రుడు అప్పారావు మెజీషియన్ కూడా కాదే' అనుకున్నాను. నా అనుమానం గమనించి పక పకా నవ్వాడు అప్పారావు. అప్పుడు నాకు అతను నిజంగా మెజీషియనే అనిపించింది.

"ముందు వార్తలు విను" అన్నాడు.

వార్తలు వినడం మొదలు పెట్టాను రీసౌండ్‌లో వచ్చాయి వార్తలు. వార్తలు అయిన తరువాత ఎవరిదో శాస్త్రీయ సంగీతం మొదలైంది. ఆ సంగీతం చెవుల్లోని తుప్పు వదలగొడుతూ ఉంది.

రెండువేళ్ళూ చెవుల్లో ఉంచుకొని "మిత్రమా నీహిప్నాటిజమ్ శక్తితో అదిగో ఆకర్షకఘోరమైన శబ్దాన్ని ఆపునాయనా" అన్నాను

"పిచ్చివాడా! రేడియో మోగేది నాయర్ నాగమణి ఇంట్లో'

"ఎవరామె?"

"ఆమె కాదు. అతను. ఈ ఆరిళ్ళ ఓనరు. అతనింట్లో ఒక పెద్ద సెవెంటీ ఎమ్.ఎమ్. రేడియో ఉంది. అది పద్దెనిమిదొందలా తొంభైయవ సంవత్సరం నాటిది. అది అన్ని వేళలా మోగుతూనే ఉంటుంది. పగలూ రాత్రీ భేదంలేదు. భాషా భేదం లేదు. చూశావుగా పైన గోడలకున్న కంతలు? ఆ చివరి నాగమణి ఇంట్లోంచి ఈ చివరివరకు అన్ని ఇళ్ళలోకి ప్రసారమవుతూ ఉంటాయి కార్యక్రమాలు"

"ఆహా!" అన్నాను తలపైకెత్తి గోడవైపు చూస్తూ.

ఇంతలో భోజనానికి పిలుపు వచ్చింది. ఇద్దరమూ భోజనాలకు కూర్చున్నాము. భోజనం వడ్డించడానికి టేబులుమీదపాత్రలు సర్దబడ్డాయి. ఏపాత్ర సక్రమంగా లేదు. వంకరటింకరగాఉన్నాయి. అన్నిపాత్రలూ సొట్టలుపోయిఉన్నాయి. ఆఖరుకు ఇంట్లో టేబుళ్లు, కుర్చీలుకూడా వికలాంగులులాగా ఉన్నాయి. టేబులు ఫానుకు మూడు ఆకులు ఉండవలసింది రెండు ఆకులే ఉన్నాయి.

"ఏమిటి వీటి పరిస్థితి?" అనడిగాను చివరకు మిత్రత్వాన్ని దృష్టిలో పెట్టుకొని.

"ట్రాన్స్ఫర్ల ప్రభావం నాయనా! ఈఊరినుంచి ఆ ఊరికి, ఆఊరినుంచి మరో ఊరికి.... ఇలా సంవత్సరానికొక ట్రాన్స్ఫరుతో ఇలా తయారయ్యాయి" అంటూ వాపోయాడు.

ఇద్దరమూ భోంచేసి బయటవరండాలో కూర్చున్నాము.

"ఏమిా అప్పారావుగారుదానా? పిల్లలూ అంతా క్షేమంగా ఉన్నారువానా! అర్జంటు పనిదా ఉంది. రేపుదా కలుస్తా" చిరునవ్వులు చిందిస్తూ వెళ్ళిపోయాడు ముఖాన అడ్డనామాలు పెట్టుకొని పంచె ఎగగట్టిన ఓవ్యక్తి.

"ఎవరాయన?"

"మాఓనరుగాడు"

"అదేమిట్రా అంత మంచాయన్నుపట్టుకొని అలా అంటావు? పాపం ఇంట్లో వాళ్ళందర్నీ క్షేమసమాచారాలు అడిగాడుగదా!"

"రేపు జీతాలిచ్చే రోజు కదా. పువ్వులోని మకరందాన్ని గ్రోలినంత మృదువుగా మాదగ్గర అద్దె వసూలుచేస్తాడు. ఏమాత్రం బాధలేకుండా సిరంజిలోకి రక్తం లాగుతాడు"

"ఫాంటా స్టిక్ మాన్!"

"అవును" అన్నాడు.

తరువాత నన్ను లేవనీయకుండా తనకు ఓటెయ్యవలసిన ఆవశ్యకత గురించి ఏకధాటిగా రెండు గంటలసేపు ఉపన్యాసమిచ్చాడు. వస్తూంటే ప్రహరీ గోడ దగ్గరున్న కొళాయి దగ్గర భయంకరమైన పోరాటం. నీళ్ళకోసం ఆడవాళ్ళ సమరం. అద్దె కొంపల్లో ఇది మామూలే, స్ట్రగుల్ ఫర్ ఎగ్జి స్టెన్స్.

బ్రహ్మచారినైన నాకు అప్పారావు ఇంటి దగ్గరి అనుభవం కూర్చున్నా, లేచినా తలలో గిర్రున తిరుగుతూనేఉంది. సంసారం సముద్రం అన్నది అప్పారావు విషయంలో యథార్థం. ఇంటిదగ్గర ఇన్ని బాధలూ పడుతూ అప్పారావు ఇంత జాగ్రత్తగా ఉద్యోగం ఎలా చేయగలుగుతున్నాడా అనేది ఆమితాశ్చర్యంగాఉంది. అతని ఓర్పుకూ, అద్దె ఇంట్లో నివసించే అతని నేర్పుకూ ఎంతగానో అశ్చర్యపోయాను.

"జగన్నాథం! నిన్న అద్దెకొంప అప్పారావు ఇంటికి పోయావటగదా! ఏం, నీ ఓటు అతనికేనా?" అని సొంత ఇంటి సుబ్బారావు నాసీటుకెదురుగా నిలబడి ఏడుపుగొంతుతో అనేసరికి ఉలిక్కిపడి తలెత్తాను.

"అలాంటిదేం లేదు సుబ్బారావుగారూ!"

"పోటీ అన్నపుడు పోటీయే. నీవు మాఇంటికికూడా రావాలి. వాడంత గొప్పా ఏం?" అన్నాడు.

దాంతో మరో ఆదివారం అతనింటికి పోక తప్పలేదు. లేక పోతే ఇప్పటినుంచే నన్నొక ప్రతిపక్ష సభ్యుడుగా చేసి మాట్లాడ గలడు.

సుబ్బారావిల్లు కనుక్కోవడం పెద్దకష్టమేమీ అనిపించ లేదు. ఊరికి దూరంగా విశాలమైన ఆవరణలో ఉన్న మేడ అది.

"రా! రా! జగన్నాథం!" అంటూ ఆప్యాయంగా పిలుస్తూ నాకోసమే అన్నట్లు బయట నిలబడి ఉన్నాడు సుబ్బారావు.

నేను అతన్ని అనుసరించాను.

"ఇది మేముండే పోర్షనోయ్" అంటూ కూర్చోబెట్టాడు.

''ఇదేమిటి? ఇంతపెద్దఇల్లూవదిలి ఒకవైపుగాఉంటున్నారు?"

"ఏముందీ, ఇంతపెద్ద ఇల్లూ అప్పుచేసి కట్టించా అప్పు తీర్చాలిగదా! అందుకే ఇంటిని కింద రెండు పోర్షన్లు. పైన రెండు పోర్షన్లుగా విభజించి మిగతావి అద్దెకిచ్చి నేనీపోర్షన్లో ఉంటున్నా?"

అతని పిసినారితనానికి నాకు చాలా బాధకలిగింది. సొంత ఇల్లులేక బాధపడేవాళ్ళు చాలామంది. అయితే సొంత ఇల్లు ఉండీ ఇరుకుగదుల్లో బాధపడుతున్న సుబ్బారావునిచూస్తే నవ్వువస్తోంది. కాని అతనుచెప్పిందికూడా కొంత బాధాకరమైన వాస్తవం కావచ్చు.

''హలో సుబ్బారావుగారూ- హమ్మయ్య ఉన్నారా?" అంటూ బయటనుంచి ఎవరో అనడంతో సుబ్బారావుతోబాటు నేనూ బయటికి వచ్చాను.

"కూర్చోండి" అన్నాడు సుబ్బారావు ముభావంగా, ఆవ్యక్తిని ఉద్దేశించి,

ముగ్గురమూ మూడు కుర్చీల్లో కూర్చున్నాము

అంతలోనే "నావద్దగర పదే ఉంది" అంటూ జేబులోంచి తీసిఇచ్చాడు సుబ్బారావు.

"మరీ పదేమిటండి అసహ్యంగా! ఇంకో పది చూడండి" అన్నాడతను అది తీసి జేబులో పెట్టూకొంటూ.

"ఇంతకంటే ఎక్కువ లేవు సార్. ఐ యామ్ వెరీ సారీ" అన్నాడు సుబ్బారావు బ్రతిమాలే ధోరణిలో.

"ఏం చేస్తాం? అంతా మా మరదృష్టం. ఇంతకుముందు మేమున్న చోటైతే మాటనరు ఎంతెంత ఇచ్చేవాడని? పాపం! అతను తిరిగి అడిగేవాడుకూడా కాదు." గొణుక్కుంటూ వెళ్ళి పోయాడతను.

"వాడెవరనుకొంటున్నావ్! పక్క పోర్షనులో అద్దెకుంటు న్నాడు. వాడో ఖూనీకోర్. ఇద్దరి భార్యలకు విషంపెట్టి చంపాడు. వాడి గత చరిత్ర తెలియక వాడి మాయ మాటలు నమ్మి ఇల్లి చ్చాను. ఇప్పటికి ఆరు నెలల అద్దెఇవ్వాలి. ఇప్పుడు వాడికి నేను పెట్టుబడి పెట్టవలసి వస్తోంది. వాడికి భయపడి...."నోరు తెరుచు కొని చూస్తున్న నాకు జవాబిచ్చాడు.

ఇంతలో మేడమీదినుంచి మృదంగ వాద్యం మొదల య్యింది హార్మోనియంతోబాటు. "జండాపైకపిరాజు...."అంటూ పద్యం. హార్మోనియం. మృదంగం మోతలతో ఆప్రదేశమంతా హోరెత్తిపోయింది.

"రామచంద్రా ఏమిటీ గోల! ఏమండీ మీరువెళ్ళి ఆ నాటక సమాజంవాళ్లని తరిమేయండి. ఎన్నిరోజులు పడతా మీ బాధ?" అంటూ వచ్చింది సుబ్బారావు భార్య కోపం అణుచుకుంటూ.

"ఎలాగే? వాళ్లు నాలుగునెలల అద్దె ఇవ్వాలి. వాళ్ళలో అసలువాడెవరో, స్నేహితులెవరో తెలియక చస్తున్నా, మొదట అద్దెకొచ్చి చేరిన వాడిముఖం ఆరోజూ చూశాను. మళ్ళీ ఇప్ప టికి కనిపించలా, వస్తే అంతా ఒకేసమయంలో వచ్చిచేరుతారు. మళ్ళీ ఒకేసారి అంతర్ధానమై పోతారు. ఎవరిని అడగాలి? ఎవ రిని కాదనాలి?" తల పట్టుకుని కూర్చున్నాడు సుబ్బారావు.

"వాళ్ళు అద్దె ఇచ్చినా ఇవ్వకపోయినా ఇంట్లోంచి తరి మెయ్యండి."

"అది నావల్లకాదే. నాలుగు నెలల అద్దె ఎనిమిది వందల రూపాయలు ఎలా వదులుకొనేది?"

"పదండి ఇద్దరం వెళ్ళి అడుగుదాం" అన్నాను సుబ్బా రావుని ప్రోత్సహిస్తూ.

ఇద్దరమూ మేడమీదకువెళ్ళి తలుపులు తట్టాము. చాలా సేపటికి తలుపులు తెరుచుకున్నాయి.

చప్పున కృష్ణపాత్రధారి వచ్చి సుబ్బారావు గడ్డం పట్టుకొని "బావా ఎప్పుడు వచ్చితీవు ఎల్లరున్ సుఖులేకదా" అంటూ పద్య మెత్తుకొన్నాడు. వీళ్ళు రిహార్సల్సులో కూడా మేకప్‌లో ఉంటారని నేనూహించలేదు. మళ్ళీ కృష్ణపాత్రధారి నావైపు చూసి "బావా! నీవెప్పుడు వచ్చితి? మున్ముందుగ నే నర్జును జూచితి...." అంటూ నాభుజంమీద చేయివేసి పద్యం మొదలుపెట్టాడు. నేను మెల్లగా భుజంమీదున్న అతని చేతిని తొలగించాను.

"ఇంకా ఎన్ని నెలలని అద్దె బకాయి పెడతారు? అద్దె ఇచ్చి ఉండండి. లేకపోతే బయటికి నడవండి." గద్దించాడు సుబ్బారావు

"ఏమిటీ నువ్వు కృష్ణుడితోనే పరాచికాలాడుతున్నావా?"

"పరాచికా లాడటానికి రాలేదు. అద్దెఅడగడానికి వచ్చాము" అన్నాను నేనూ కోపంగా.

''మమ్మల్ని అడ్డె అడిగే నరాధము లెవ్వరు? మేము డిసెంబరు వరకు కంట్రాక్టుకు ఈపోగ్రను మాట్లాడుకొని నరసరాజుకు డబ్బు ఇచ్చేశాం'' అన్నాడు భీముడు వేషధారి గద భుజంమీద పెట్టుకొని ముందుకు వస్తూ. తరువాత వరుసగా మిగతా పాండవులు, కౌరవులు ద్రౌపదితోసహా గుంపుగా చేరారు.

అందులోంచి ధర్మరాజు ముందుకు వచ్చి "కృష్ణా ఎందుకయ్యా మౌనంగా ఉంటావ్? నీవిశ్వరూపంచూపి ఆ ఇద్దరి నరాధములకూ మోక్షం కలిగించు" అన్నాడు.

"బావా నేనును అదియే ఆలోచించుచున్నాను. రుక్మిణీ!...." అంటూ పిలిచాడు.

"ఈరోజు రుక్మిణి రాలేదు కృష్ణా! వాళ్ళాయనకు ఒంట్లో బాగులేక ఇంట్లోనే ఉండిపోయింది. సత్యభామ ఉంది. రమ్మంటారా" అన్నాడు నకులుడు

''ఛ....వద్దనే వద్దు. మొన్న బస్ స్టాప్‌లో కనిపించింది 'ఓయీ సత్యా- ఒక్కసారి నా కౌగిలిలోకివచ్చి నాకోర్కె నెరవేర్చు' అన్నాను డ్రామాలో డైలాగు గుర్తొచ్చి. అంతే ఫెడీమని కొట్టింది. చెంపపగిలిందనుకో. అందుకే దాన్ని పిలవకు" అన్నాడు కృష్ణుడు అప్పుడే దెబ్బతగిలినట్లు చెంప తడుముకుంటూ.

"అదీ గిదీ అనకు. మర్యాదగా మాట్లాడు. తప్పు నీది" అంటూ ముందుకు వచ్చింది సత్యభామ

చప్పున కృష్ణుడు ధర్మరాజు వెనుక దాక్కొని "తప్పు నాదికాదు. నీది. ఏదో నాహీరోయినువికదా. బస్‌స్టాపులో ఉన్న అందరికీ నా నటనా కౌశలం చూపుదామనుకొన్నాను. అందుకని రమ్మన్నంత మాత్రాన అంత దెబ్బ కొట్టాలా? చూడు. ముందు ముందు నిన్నేం చేస్తానో" అన్నాడు వ్రేలు చూపిస్తూ.

"నన్నేం చేస్తావ్? నీ బోడిబెదరింపులు నావగ్గర కావు" అంటూ ఘర్షకు దిగింది సత్యభామ.

క్షణంలో అక్కడున్న వాళ్ళంతా రెండు వర్గాలుగా చీలి పోయి గదులు, కత్తులు బాణాలు అందుకొని ఒకరి నొకరు తిట్టు కోవడం మొదలుపెట్టారు. నేను చప్పున తలుపు మూసి "సుబ్బా రావ్....కురుక్షేత్ర సంగ్రామం మొదలయింది. అందరూ కొట్టుకొని చస్తారు. తరువాత శవాలు ఎత్తేదానికి మునిసిపాలిటీవాళ్ళకు ఫోనుచేద్దాం. కొంతయినా భూభారం తగ్గుతుంది" అన్నాను.

నా మాటలకు సుబ్బారావు సంతోషిస్తాడనుకొన్నాను కాని సుబ్బారావు నోరెత్త లేదు. నేను ఆశ్చర్యంగా చూశాను.

"హు....నువ్వో పిచ్చివాడివి. ఇది నాకు ఆనందం కలిగి స్తుందని అనుకున్నట్లున్నావు. వాళ్లు ఇప్పుడొక నాటకమడారంటే నువ్వు నమ్ముతావో నమ్మవో కాని నే నెప్పుడు అద్దె అడగడానికి వచ్చినా వాళ్ళిలాంటిదేదో ఒక నాటక మాడి ఘర్షణకు దిగుతూం టారు. ఇది నాకు మామూలే" అన్నాడు ఇప్పుడు ఆశ్చర్యపోవడం నావంతయింది.

సుబ్బారావింట్లో భోంచేయక తప్పలేదు. కొద్దిసేపు పేకాడు కొన్నాము. సాయంత్రం ఇంటికి బయలుదేరేముందు కాఫీతాగుతూ అన్నాను.

"ఇప్పటివరకు మీ ఇంట్లో రెండు పోర్షన్లలో ఉన్నవాళ్ళ సంగతే చెప్పావు. మేడమీదఉన్న ఇంకో పోర్షను వాళ్ళ సంగ తేమిటి?"

సుబ్బారావు విచారంగా ముఖంపెట్టి "వీళ్ళందరికంటే అది మరీ విచిత్రమైన కథ. సుమారు ఎనిమిది నెలల క్రితం రెండు నెలల అద్దె అడ్వాన్సిచ్చి వకచకా బీరువాలు, సోఫాలు

మిగతా ఫర్నిచర్‌తో చేరిపోయారు. వారంరోజులుండి ఏదో అర్జంటు పని తగిలిందని భార్యాభర్తలు ఇంటికి తాళంవేసుకొని వెళ్ళారు. ఇప్పటికీ తిరిగిరాలేదు. ఇంకో నాలుగు రోజులు చూసి పేపరు ప్రకటనిచ్చి అప్పటికీ రాకపోతే కోర్టువారిని దగ్గరపెట్టుకొని తలుపులు తీయిస్తాను. నాకు రావలసిన బాకీకి సరిపోయే సామాను జమ కట్టుకొని, మిగతా సామాను కోర్టుకి అప్పజెబుతాను'' అన్నాడు.

విచిత్రమైన పరిస్థితులలో సాలెగూటి మధ్య చిక్కుకొన్న సొంత ఇంటి సుబ్బారావువైపు జాలిగా చూసి అతని దగ్గర సెలవు తీసుకొని బయలుదేరాను. మేడిపండులా కనిపించే సొంత ఇంటి సుబ్బారావుకంటే వెలగపండులా పైకి కఠినంగా కనిపించే అద్దె ఇంటి అప్పారావు ఎంతో సుఖంగాఉన్నాడు.

అద్దె ఇంటి అప్పారావు ఇచ్చేవాడయితే, సొంత ఇంటి సుబ్బారావు పుచ్చుకొనేవాడు. ఎంతైనా ఇచ్చేవాడిదే పైచేయికదా! అయితే, ఈ ఎలక్షన్లో నే నెవరికీ ఓటు వేయదలుచుకోలేదు. కారణం! తన కొడుకుని అదుపులో పెట్టుకోలేని అసమర్థుడు అద్దె ఇంటి అప్పారావు. సొంత ఇల్లు ఉండీ అద్దెవాళ్ళలా సుఖ మెరుగని వాడు సొంత ఇంటి సుబ్బారావు. తమ సమస్యలను తామే పరిష్కరించుకోలేని వీళ్ళు ఇక ఉద్యోగుల సమస్యలను ఏవిధంగా పరిష్కరించగలరు?



# రక్తంలో రంగులు

ప్రతాప్ స్కూటర్‌కి స్టాండువేసి, కర్టెను తొలగించుకొని లోపలికి ప్రవేశించాడు. కమల హాల్లో లేదు. తను ఇప్పుడు సినిమా ప్రోగ్రాం వేసాడు కాబట్టి చక్కగా ముస్తాబు అవుతూ ఉంటుంది అనుకొన్నాడు. మెల్లగా వెళ్లి కళ్ళుమూయాలి అనుకొన్నాడు. అన్ని రూములూ చూశాడు. ఎక్కడా కనిపించలేదు. చివరకు పెరడు దగ్గరకొచ్చాడు.

అక్కడ ఏదో పోగొట్టుకొన్నట్లు దిగులుగా కూర్చొని ఉన్న కమలను చూడగానే కోపం వచ్చింది.

"ఏం సినిమాకు పోదామని ఇంకా ఇలా కూర్చొని ఉన్నావ్" అన్నాడు గట్టిగా.

కమల మాట్లాడకుండా లేచి నిలబడింది. మౌనంగా నేల చూపులు చూడసాగింది.

ప్రతాప్‌కు జాలి కలిగింది. ఏదో కారణం లేకపోతే తప్ప కమల మౌనంగా ఉండదు.

కమల నడుం చుట్టూ చేతిని పోనిచ్చి గుండెలకు హత్తుకొంటూ "చెప్పు కమలా ఏం జరిగింది. ఎందుకిలా ఉన్నావు" అన్నాడు లాలనగా.

"పిల్లలిప్పుడే స్నానంచేసి ట్యూషను కెళ్ళారు"

"మరి మన సినిమా ప్రోగ్రాం, రేపు వెళ్దామా"

కమల మాట్లాడలేదు.

"చెప్పు కమలా"

"సారీ అండీ. కాఫీ ఇవ్వడమే మర్చిపోయాను. ఉండండి పది నిముషాల్లో చేసుకొస్తాను''

విడిపించుకోబోయింది.

కాని ప్రతాప్ వదలిపెట్టలేదు.

"కాఫీ సంగతి వదిలెయ్ కమలా. ఇప్పుడైనా సినిమాకు వెళ్దాం. ఇంకా అరగంట టైముందిగా"

"వద్దండీ"

"ఏం"

"నా మనసేం బావోలేదు"

ప్రతాప్ చేతులు వాటంతటవే విడిపోయాయి. కమల ఇంట్లో కెళ్ళింది కాఫీ తేవడానికి. హాల్లోకొచ్చి తలపట్టుకొని కూర్చొన్నాడు.

ప్రతాప్‌కి కమల ప్రవర్తన ఏమీ అర్థంకావడంలేదు. ఈ ఎనిమిదేళ్ళలోనూ, కమల ఎప్పుడూ తనమాట కాదనేది కాదు. తను ఏదంటే అదే. తన గాఢ పరిష్వంగనమే స్వర్గమనుకొనేది. తను ఆమె ఒడిలో తలపెట్టుకొని ఆమె చెప్పే ప్రేమ పాఠాలకు ఊకొడ్తూ మధ్య మధ్య అమాయకుడిలా అదేమిటి, ఇదేమిటి అని ప్రశ్నిస్తే మధురంగా నవ్వేది.

అలాంటిది ఈరోజు ముభావంగా ఉంటే ప్రతాప్‌కి ఏదోలా ఉంది. మనసు ఏదో కీడు శంకించింది. ఎన్నడూలేని ఆమె ప్రవర్తన ఈనాడు విడ్డూరంగా కనిపిస్తోంది.

''కాఫీ తీసుకోండి'' అంది కప్పు అతని కెదురుగా ఉంచి.

''కమలా అలా కూర్చో"

''నాకు అవతల చాలా పనుంది. వెళ్ళాలి''

"వెల్దువులే. అసలింతకూ ఏం జరిగింది. అలా ముభావంగా ఉన్నావు''

"ఏమీలేదు"

''ఏమీలేదనకు. నిజం చెప్పు'' అన్నాడు ఆమె కళ్ళలోకి సూటిగా చూస్తూ.

ఆమె ఆ చూపుల్ని తప్పించుకోవడానికి తల వంచుకొని గోళ్ళు చూసుకొంటూ ఉండిపోయింది.

ప్రతాప్‌కి ఏమీ అర్థం కాలేదు. తను ఏమైనా పొరపాటుగా భార్యతో ప్రవర్తించాడా అంటే అలాంటిదేమీ జరగలేదు మరి ఈమె ముభావానికి కారణం? అందులో కమల మనస్తత్వం అందరి స్త్రీలకంటే విలక్షణమైనది. ఏదైనా బాధుంటే తనలోనే దాచుకొంటుంది. తనలో తనే కుమిలిపోతుంది. ఎవరితో ఏమీ అనదు. ఎవరేమన్నా భరిస్తుంది.

ఇంతలో ట్యూషను నుంచి పిల్లలొచ్చారు.

"మమ్మీ. మరే నాకు చాక్లెట్టివ్వు" అన్నాడు పెద్దవాడు.

చిన్నవాడు పరుగెత్తుకువచ్చి, "మమ్మీ ఎత్తుకో" అంటూ కాళ్లకు చుట్టుకొన్నాడు.

కమల నిర్వికారంగా వాళ్ళను ప్రక్కకునెట్టి లోపలికి వెళ్ళింది.

అదే ఇంకోసమయంలో అయితే వాళ్ళను దగ్గరకులాక్కొని ముద్దుపెట్టుకొని "నాబంగారు బాబులూ! ఎంత ముద్దుగా అడిగారురా" అంటూ ఎంతో గారాబం చేసేది.

వాళ్ళు ఊహించినట్లు జరక్కపోయేసరికి ఏడుస్తూ వెళ్ళి తండ్రి ఒడిలో తలదాచుకొన్నారు.

ప్రతాప్ హృదయం కలుక్కుమంది. తను మగవాడు. అర్థంచేసుకొనే వయసుంది. తను ధైర్యంగా ఉండగలడు. కాని చిన్నపిల్లలతో ఇలా ఉంటే బేజారెత్తిపోరూ. అందుకే పిల్లలిద్దర్నీ

సముదాయించి గేటు వద్దకు తీసుకుపోయి రోడ్డువెంటవెళ్ళే వాహనాల్ని చూపిస్తూ వాళ్ళని ఆనందింపజేశాడు.

ఆ రాత్రి పిల్లలిద్దర్నీ నిద్రపుచ్చి అలాగే కూర్చొని ఉంది కమల. గదిలో పడుకొనివున్న ప్రతాప్ కమల లైటార్పి తన ప్రక్కకు వస్తుందేమోనని చాలా సేపు చూశాడు. ఆమె రాలేదు. ఇలా కాదని బుజ్జగించి ఆమె మనసులోని మాట బయటకు లాగాలనుకొన్నాడు. పిల్లలు పడుకొనిఉన్న గది గుమ్మం వద్దకు వచ్చి నిలబడ్డాడు.

"కమలా"

"ఊఁ"

"ఎందుకా ఆలోచన పడుకొందువుగాని రా" అంటూ పిలిచాడు. ఆమె అతని వైపు చూస్తూ ఊరుకొంది. ప్రతాప్ లేచి ఆమె దగ్గరకువెళ్ళి చేయిపట్టుకొని క్రొత్తపెళ్ళికూతురిలా ఆమెను బెడ్ దగ్గరకు తీసుకొచ్చాడు.

కమల మౌనంగా పడుకొంది. ఆ రోజు ఎంత ప్రయత్నం చేసినా కమలను ప్రసన్నం చేసుకోలేకపోయాడు ప్రతాప్. ఆమె మనసులోని మాట చెప్పలేదు. మరునటి రోజు నుంచి పడకలు వేరయ్యాయి. కలిసిన మనసులు విడిపోయాయి.

ఇద్దరూ యాంత్రికంగా జీవిస్తున్నారు. భార్యా భర్తలుగా ఒకే గూడుకింద ఉన్నారే తప్ప సుఖంగామాత్రం లేరు. ఒకరితో ఒకరు మాట్లాడుకోరు. ముభావంగా ఉంటున్నారు. ఈ అనవసర తగాదాకు మనసొప్పని ప్రతాప్ పిల్లలు నిద్రపోయిన తర్వాత ఒకసారి భార్యను నిలదీశాడు

"ఏం కమలా నేనంటే అంత వెగటైపోయిందా"

"అదేం లేదు"

"మరయితే ఎందుకలా ముభావంగా ఉంటావు"

"బాగానే ఉన్నానే"

"ఎందుకు అబద్ధాలాడుతావు. నువ్వు మనషివి చూడ్డాని కలా ఉన్నావేగాని నీ మనసులో ఏదో విషపురుగుచేరి నిన్ను తొలిచేస్తూ ఉంది. ఎందుకిలా నన్ను బాధపెడ్తావు"

"మిమ్మల్ని నేనేం బాధపెడుతున్నాను. మీరు అడిగింది కాదంటున్నానా"

"కమలా ఏమీ తెలియనట్లు బుకాయించకు. బలమైన ఇనుపకడ్డీలను సయితం కొలిమిలో పెట్టి మనిష్టంవచ్చినట్లు తిప్పు కోవచ్చు. కాని మనసనేదుంది చూశావూ. దానిని ఏసాధనంతోనూ బలవంతంగా ఎవరూ తనవైపు తిప్పుకోలేరు. అతి సున్నితమైన ఆ హృదయం ప్రేమ అనే కొలిమిలోనే కరుగుతుంది"

"అవును"

"అందుకే నీమనసు నావైపు తిప్పుకొనేంత ప్రేమ నా దగ్గర లేనందుకు విచారిస్తున్నాను"

".... .... .... ...."

"సిగ్గుపడుతున్నాను కూడా"

".... .... .... ...."

"జీవం లేని ఇది సంసారం కాదు నరకం. ఛీ....ఛీ" బయ టకు వెళ్లి తలపట్టుకొని వాలుకుర్చీలో కూర్చొన్నాడు.

కొద్దిసేపటికి ఇంట్లోంచి వెక్కిళ్ళు వినపడ్డాయి. లోపలికి వెళ్ళేసరికి కమల గోడవైపు తల ఉంచి ఏడుస్తోంది. ఆమె పలు చని పొట్ట ఆ ఏడుపుకు కదులుతూ ఉంది. కారుతున్న కన్నీళ్ళని పైట చెంగుతో తుడుచుకొంటోంది.

ఆ పరిస్థితిలో అమెను చూసేసరికి అతనిలో బలీయమైన ప్రేమ దుఃఖంలా పెల్లుబుకింది. తను మౌనంగా ఉన్న కమలను

ఇన్ని మాటలని రెచ్చగొట్టి ఆమె మనసును బాధపెట్టాడు. తనకు ఆమె అంటే విపరీతమైన అభిమానం ఉండడంవల్ల తనతో ముభావంగా ఉంటున్నదనే కోపంతో ఇన్ని మాటలన్నాడు. నిజమైన ప్రేమికుడు తను ఎంత దుఃఖంలో ఉన్నా అవతలి వారి సుఖమే కదా కోరేది అనుకొన్నాడు.

అందుకే ప్రతాప్ ఆరోజు నుంచి కమలను ఏమనేవాడు కాదు. తన పెళ్లిచూపులు, పెళ్ళయిం తరువాత పండుగలకు పబ్బాలకు కూడా పోకుండా తనలోనే అన్నీ చూసుకొని తనలో లీనమైపోయిన కమల ముచ్చట్లు స్మృతికి తెచ్చుకొని దుఃఖాన్ని మరిచిపోయేవాడు.

కమల భర్త మీదలాగే పిల్లల విషయంలోకూడా ముభావంగా వాళ్ళ బాగోగులు చూస్తూ యాంత్రికంగా జీవితం గడిపేస్తోంది. రెండు నెలల తరువాత కమల తరఫు దగ్గర బంధు వొకాయన వచ్చి కమలను, ఆమె భర్తను తన కుమార్తె వివాహానికి రమ్మని ఆహ్వానించిపోయాడు. భార్య తరఫువారు కావడంతో ప్రతాప్ అత్తగారు రెండురోజులు ముందుగా కుమార్తె ఇంటికి వచ్చారు.

అనుకొన్న సమయానికి ప్రతాప్‌కురావడం ఇష్టంలేక సెలవు దొరకలేదని దాటేశాడు. కమల పిల్లల్ని పెళ్ళికి తీసుకుపోవడం ఇష్టంలేదంది. ప్రతాప్ నిరుత్తరుడయ్యాడు అయినా మనసు సమాధాన పెట్టుకొన్నాడు. తల్లి ఎంత చెప్పినా వినకుండా పిల్లల్ని స్కూలుకు పంపి తనొక్కటే తల్లితో పెళ్ళికి బయలుదేరింది.

పిల్లల్ని కమల తనతో తీసుకుపోనందుకు ప్రతాప్ మనసు తీవ్రంగా బాధపడింది. పసిపిల్లల మనసులు విరిగి ఉంటాయి అనుకొన్నాడు. ఆ ఊళ్ళోనే వివాహంచేసుకొని కాపురంచేస్తున్న తన

చెల్లెల్ని వచ్చి రెండురోజులుండమని పిలిచాడు. తన భార్య కమల కసితోనే తనను, పిల్లల్ని నిర్లక్ష్యం చేస్తోందని భావించాడు.

పెళ్ళి వారింట్లో మొదట కమలకు, ఆమె తల్లికి వాకిట్లోనే ఎదురువచ్చింది పరిమళ.

"ఏం కమలా ఒక్కదానివే వచ్చావ్. మీఆయనా, పిల్లలేరి" అంటూ పలుకరించింది.

"ఏమోనే, నీవు మా ఇంటికి వచ్చిపోయినప్పటినుండి, మా ఆయనన్నా, పిల్లలన్నా, ఏదోగా ఉంది. వాళ్ళతో సరిగా మాట్లాడడానికికూడా బుద్ధిపుట్టడంలేదు" కమల జవాబు

పరిమళ వ్యంగ్యంగా ప్రశ్నించడం, కమల అమాయకపు జవాబు కమల తల్లికి ఏదో కొత్తవిషయం తెలియజేసింది. కమల ఆమె భర్త ప్రతాప్ తనముందు ఏమీ ప్రదర్శించకపోయినా వాళ్లిద్దరిమధ్య ఏదో అపార్థం ఉందనే విషయం ఆమె అంతకుముందే గ్రహించింది. ఇప్పుడు కారణం కొద్దికొద్దిగా బోధపడసాగింది.

ఇంతలో 'మమ్మీ' అంటూ ఒక పిల్లవాడు పరుగెత్తుకు వచ్చాడు. వాడు ఎర్రగా, సన్నగా ఉన్నాడు.

పరిమళ దగ్గరకొస్తున్న పిల్లవాణ్ని చేతుల్లోకెత్తుకుంది కమల.

"మీ పిల్లవాడు ఎంత బాగున్నాడే. నాకూ ఉన్నారు దేనికి, నల్లని మొద్దులు" ముద్దుల్లో ముంచుతూ అంది.

కాళ్ళుకడుక్కొని లోపలికి వచ్చారు. పెళ్ళికివచ్చిన బంధువులందరూ పరామర్శించారు. ప్రతిఒక్కరూ, భర్తను, పిల్లల్నీ తీసుకురాలేదేం అంటూ కమలను ప్రశ్నించారు. కమల భర్తకు సెలవు దొరకలేదని, పిల్లల్ని ఇంతదూరం ఎండలో ప్రయాణం చేయించడం ఇష్టంలేక తీసుకురాలేదని చెప్పింది.

ఎంతమందితో మాట్లాడుతున్నా పరిమళ, కమల సంభాషణ అతి జాగ్రత్తగా వింటూ పరిస్థితి గమనిస్తోంది కమల తల్లి. కమల, ఆమె భర్త అభిప్రాయ భేదాలకు కారణం విచారించనాగింది.

ఆ రాత్రి అందరూ భోజనాలుచేసి ఎవరికివారు తలా ఒక చోట మాట్లాడుకొంటున్నారు. పెళ్ళిమరురోజు ఉదయం ఆరుగంటలకు. పెళ్ళికుమారుని తండ్రి వచ్చి మేడమీది తూర్పువైపు గది వాళ్ళకు కేటాయించారని, పైకి వెళ్ళి పడుకోవచ్చని చెప్పి వెళ్ళిపోయాడు.

కమల, ఆమె తల్లి మేడమెట్లు ఎక్కారు. కమల తలుపు తీయబోతూ ప్రక్క గది లోపల సంభాషణ విని ఆగిపోయింది. అందులో తన పేరు వినబడడంతో.

పరిమళ వెక్కిళ్ళు వినిపిస్తున్నాయి.

"అప్పుడు ఆమె భర్త లేడా" అడుగుతోంది పరిమళ తల్లి.

"లేదమ్మా. కమల ఒక్కతే ఉంది."

"నీమాటలకు ఆమె ఏమంది"

"ఏమంటుంది. నాకింతకాలం తెలియదక్కా, నిజంగా ఇప్పుడాలోచిస్తే ఇంతకాలం చీకటికి సింబల్‌గా నల్లగాఉన్న భర్తతో ఎలా కాపురం చేసానో. పిల్లలుకూడా అదే రంగుతో ఎంత అనహ్యంగా ఉన్నారు. నువ్వు చెప్పింది నిజమే. ఎర్రగా, అందంగా ఉండే భర్త, తెల్లగా ముద్దొచ్చేట్టు ఉండే పిల్లలూ, పదిమంది కంటికి ఇంపుగా ఉండేది అలాంటి సంసారమే కదా అంది"

"వెంటనే వచ్చేసావా"

"వచ్చేసాను. వస్తూ వస్తూ కమల మనసులో ఓ విషపు బొట్టు రాల్చేసి వచ్చాను. అది నిజంగా బాగాపనిచేసినట్లు కమల ఒంటరిగా రావడంతోనే అర్థమయింది"

"అరెరె....పాపం"

"పాపం ఏమిటమ్మా. లేకపోతే నన్నుచేసుకొంటాడనుకొన్న ప్రతాప్ నన్నుకాదని మనకంటే ఆస్తిలేని కమలను కానీ కట్నం లేకుండా చేసుకొంటాడా. నేను ఆయన్ని పెళ్ళిచేసుకోవాలని ఎన్ని కలలుగన్నాను. ఆయన స్కూటరుమీద తిరగాలని ఎంత తపించి పోయాను" ఏడుస్తూ అంది పరిమళ.

"ఛ....ఏడవకే"

"ఏడవక ఏం చేసేది. నాకూ కట్టారుగా ఓ మొగుడ్ని. ఎలిమెంటరి స్కూలుటీచర్ని. నయాపైసా ఖర్చుపెట్టడానికి ఏడుస్తాడు. ఒక మంచి నగలేదు. ఒక మంచి బట్టలేదు. పిల్లలు చూడబోతే ఈవయసులోనే తల్లిదండ్రులు మాట వినేట్టులేరు. కమల భర్త ప్రతాప్‌కి రెండు వేలు జీతం ఆయన నలుపైతేనేం ఎంత బాగుంటాడు. నొక్కుల జుట్టు. భారీ ఆకారం, పిల్లలుమరీనమ్మా రంగు తక్కువైతేమాత్రమేం ఎంతో ముద్దొస్తారు. ఎంతో క్రమశిక్షణతో ఉంటారు. తెలివిగలవాళ్ళుకూడా. అందుకే నాకు కాని దానిని ఇంకొకరు అనుభవిస్తూంటే చూళ్లేకపోయాను" వెక్కిళ్ళు ఎక్కువయ్యాయి.

"ఎవరికెంత ప్రాప్తమో అంతేనే పరిమళా. ఇక పడుకో. ఎవరైనా వింటే కమలకు చెప్పేస్తారు"

"కమలకు ఆమె భర్తత్వరలోనే విడాకులిస్తాడని నా ఉద్దేశ్యం" అంది పరిమళ. తరువాత నిశ్శబ్దం. లైటు ఆరిపోయింది.

అంతవరకూ వస్తున్న కోపాన్ని నిగ్రహించుకొంటున్న కమలకు విడాకులు అన్నపదం వినిపించేసరికి నృత్యహతప్పుతున్నట్లు క్రిందపడిపోయింది, తల్లి ఆమెకు శుశ్రూషచేసి గదిలోకి తీసుకొచ్చింది. ఆరాత్రంతా నిద్రపోకుండా తల్లి ఒడిలో తలపెట్టుకొని

తనభర్త తనను ఎలా ప్రేమించేది. తన పిల్లలు తనపై చూపే అభిమానం. తను వాళ్ళకు చేసిన అన్యాయం చెప్పకొని, చెప్పకొని ఏడ్చింది.

వివాహం పూర్తికావడమే తడవు తిరుగు ప్రయాణమయ్యారు తల్లీకూతుళ్ళు.

పరిమళ ఎంతోఅప్యాయంనటిస్తూ "కమలా ప్లీజ్. ఈరోజు ఉండిపో" అంది చేయిపట్టుకొని.

కమల మెల్లగా తనచేతిని విడిపించుకొని "నేను మాఅమ్మతోటే ఊరికి వెళ్తున్నాను. ప్రతాప్ దగ్గరకు వెళ్ళే ఉద్దేశ్యంలేదు" అంది ఓదారుస్తున్నట్లు.

పరిమళ ఆనందంగా నవ్వి "అలాగయితే వెళ్ళిరా. ఉండమన్నా ఉంటావా'' అంది.

ఇంతలో పరిమళ కొడుకు పరుగెత్తుకుంటూ వచ్చాడు జారిపోతున్న లాగు పైకి లాక్కుంటూ, ఇంకోచేతిలో లడ్డుపట్టుకొని కొరుక్కుంటున్నాడు. ఒంటిమీద చొక్కాలేదు. ఉదయాన్నే మట్టిలో పొర్లాడి వస్తున్నట్లుగా ఉన్నాడు. ఇంతకుముందు మెచ్చుకొన్న కమల ఈసారి వాడివైపుకూడా చూడకపోవడంతో పరిమళ ముఖకవళికలు కొద్దిగా మారాయి.

తిరుగు ప్రయాణంలో కమల హృదయం పశ్చాత్తాపంతో దహించుకుపోసాగింది. తన కన్నబిడ్డల్ని తనే అసహ్యంచుకొనే తల్లి ఈ ప్రపంచంలో ఎక్కడైనా ఉంటుందా. 'అమ్మా' అంటూ తనను పెనవేసుకొనే తనరక్తం పంచుకుపుట్టినబిడ్డలు తల్లి ప్రేమ కరువై ఎంత దిగులుపడ్డారో. బిడ్డలమీద ప్రేమానురాగాలు పొంగి పొరల సాగాయి

తనను ప్రేమించి పూజించే భర్తయెడల తనెంత నిరాదరణ చేసింది. దీనికంతటికి కారణం పరిమళ. ఆరోజు ఉదయం భర్తను సాగపంపి ఇంట్లోకిపోతుంటే "కమలా"అని ఎవరో పిలిస్తే వెనక్కి తిరిగింది. అక్కడ తన చిన్ని కూతురు పరిమళ వుంది.

"ఎన్నాళ్ళకు చూశాను. రా లోపలికి" అంటూ ఆహ్వానించింది తను. తన భర్తతరపు బంధువులు ఈ ఊళ్ళో వున్నారని, బంధువుల ఇంటి దగ్గర నుంచి అలా బజారుకు బయలుదేరితే ఇక్కడ తనను చూసినట్లు చెప్పింది.

ఒకే ఊరివారుకావడం చిన్ననాటి కబుర్లు ఎన్నో చెప్పుకొన్నారు. ఇంతలో తన పిల్లలు వచ్చారు. వాళ్ళని తను ఎత్తుకొని ముద్దుచేసింది. "ఏమిటే కమలా నీకు పిల్లలింత నల్లగా పుట్టారు....ఛీ....ఛీ నువ్వెంత తెల్లగా, అందంగా నాజూగ్గా ఉన్నావు. నీపిల్లలేమిటి ఇలా బొగ్గుల్లాగున్నారు" అంది.

తన మనసు చివుక్కుమంది.

"బాధపడకులే ఏంచేస్తాం. నీభర్తరంగూ అదేకదా" అంటూ ఓదార్చింది. తనైతే ప్రాణంపోయినా అలాంటి భర్తతో పిల్లలతో కాపురంచేయనని చెప్పింది. ఇంకా ఏవేవో ఉదాహరణలతో తనకు బోధచేసింది.

అంతే....తన బేలమనసు విరక్తితో నిండిపోయింది. తన కాపురమూ ఒక కాపురమేనా అనిపించింది. ఏమీలేని బీదకుటుంబంలో పుట్టిన తనను కానీ కట్నంలేకుండా పెళ్ళిచేసుకొన్నాడని కూడా తను ఆరోజు ఆలోచించలేదు. ఆయన మంచి మనసును గ్రహించలేక పోయింది.

ఇవన్నీ గుర్తుకొచ్చి కళ్ళనీళ్ళు నింపుకోసాగింది. కూతురు పరిస్థితి గమనించిన తల్లి ఆమెను ఓదార్చసాగింది.

ఇంటికి వచ్చేసరికి బయట వరండాలో ఇద్దరుపిల్లల్ని కూర్చో బెట్టి ఏవో చెబుతున్నాడు ప్రతాప్. తల్లిని చూసినా పిల్లలు అక్కడి నుంచి కదలలేదు

"ఒరేయ్ నాన్నలూ ...బాబూ"అంటూ గేటు దగ్గర నుంచే చేతులు చాపింది.

ఆ పిలువు కోసమే తపించిపోయినవాళ్ళు వెర్రి ఆనందంతో పరుగెత్తి తల్లిని పెనవేసుకున్నారు. ఇంతలో ఇంట్లోంచి వచ్చిన ప్రతాప్ చెల్లెలు "ఇప్పుడేనా రావడం" అంటూ నవ్వుతూ పలుకరించింది.

ప్రతాప్ లోపల గదిలోకివెళ్ళి పడుకొన్నాడు. కొద్దిసేపటికి తలుపులు తెరచుకొన్నాయి. గుమ్మంలో....

నీళ్ళు నిండిన కళ్ళతో కమల.

కొద్దిసేపు మౌనంగా ఉన్నాడు ప్రతాప్.

"పెళ్ళి బాగా జరిగిందా" రెండు నెలల తరువాత మొదటి సారిగా మాట్లాడాడు.

అవున్నట్లు తల ఊపింది కమల.

"సరే వెళ్ళి రెస్టు తీసుకో. చాలాదూర్ప్రయాణం కదా"

అయినా ఆమె కదల్లేదు.

"అవి తప్ప ఇంకేమీ లేవాండీ, మాట్లాడడానికి" దుఃఖం ఎక్కువకాగా బొంగురుగా అడిగింది.

''ఇక కొత్తవిషయాలేం లేవు. పిల్లలు బాగానే ఉన్నారుగా" అంటూ కళ్ళు మూసుకొన్నాడు.

కమల ఇక ఆగలేకపోయింది. ఒక్కొక్క అడుగే ముందుకు వేస్తూవచ్చి ప్రతాప్‌ను ఆర్తిగా కౌగిలించుకొంది. అతని శరీరాన్ని నిమురుతూ పెద్దగా ఏడ్చింది.

"నేను....నేను మోసపోయానండి. ఎవరో ఏదో మాట్లాడితే దాన్నే నమ్మిన మూర్ఖురాల్ని నన్ను క్షమిస్తారు కదూ"

"ఇందులో క్షమించడానికి నువ్వేం తప్పు చేసావు. సంసారంలో ఎవరి హక్కులు వాళ్ళకున్నాయి. ఎవరి స్వాతంత్ర్యం వాళ్ళకుంది. నీ హక్కును, స్వాతంత్రాన్ని నేనెప్పుడూ భంగం చేయదలచుకోలేదు"

"అంతేనా. నన్ను మీరు పూర్వంలా ఆదరించలేరా. ప్రేమించలేరా"

"పిచ్చి కమలా. నీది సున్నితమైన మనసు. కనుకనే పరిమళ తేలిగ్గా ని మనసును మళ్ళించగలిగింది. కాని ఏరోజుకైనా నీవు పశ్చాత్తాపపడతావని నాకు తెలుసు. నీవు వెళ్లిన తరువాత పరిమళ భర్తద్వారా, నీవు అలా ఎందుకు ప్రవర్తిస్తున్నావో తెలుసుకొన్నాను. కమలా ఒకటి మాత్రం నిజం. నేనూ నా పిల్లలు నల్లని వాళ్ళమే. కాదనను. మాలో ప్రవహించేది, ఎర్రగా అందంగా ఉన్నాననుకొంటున్న పరిమళ శరీరంలో ప్రవహించేది ఎర్రని రక్తమే. అందరి శరీరాల్లో ప్రవహించేది ఎరుపు రక్తమే అయినా అందులో కనుపించని ఎన్నో రంగులున్నాయి. పరిమళ శరీరంలో విషపూరితమైన నల్లని రక్తం ప్రవహిస్తోంది. అది తెలుసుకొన్నావు చాలు"

"ఐయామ్....సో సారీ" భర్తను కన్నీళ్ళతో అభిషేకించింది కమల.



# మహాత్ములకు చావులేదు

విశాలమైన వటవృక్షం నీడన మొలచిన వేపమొక్కల్లా, సువిశాలమైన భారతదేశం పరిధుల్లో ఎదుగూబొదుగు లేని పల్లె టూరు అది. ఊరికి అన్ని హంగులూ ఉన్నాయి. బడి ఉంది. పంచాయితీబోర్డు ఉంది. ఊరిని నాలుగు వైపులా కలుపుతూ వీధులున్నాయి. వీధులు పరిశుభ్రంగా ఉన్నాయి. నీతి, నిజాయితీలు అక్కడి ప్రజల రక్తంలో ప్రవహిస్తూ ఉంటాయి. ప్రేమ, అభి మానం వారి ధ్యేయం. మానవ శరీరానికి ప్రాణం ఎంత అవస రమో, జీవితానికి ధర్మం అంత అవసరమంటారు ఆ ఊరి ప్రజలు.

పట్టణంలోని రాజకీయాలు, మత కలహాలు, ఆధునిక పద్ధ తులు ఆ ఊరివారికి పట్టవు. తనకు తోచిన న్యాయం ఆ ఊరి మునసబు చేస్తాడు. అంతేనంటాడు కరణం. ప్రెసిడెంటు దానికి ఎదురుచెప్పడు. ప్రజలకు అదే వేదవాక్కు. ఇలా ఆ గ్రామ పరి పాలన నాలుగు పాదాలమీద నడవడానికి కారణం పరోక్షంగా రామశాస్త్రి.

కాని రాముడు కాలంలో రావణుడున్నట్లే ఇక్కడా దుర్మా ర్గులు లేకపోలేదు. కాని మేరు పర్వతాల్లాంటి నీతి, న్యాయం, ధర్మం, పరిపాలన చేస్తోంటే వాటి క్రింద ఉన్న మట్టిబెడ్డల్లా కద లక మెదలక పడివున్నారు.

రామశాస్త్రి తన ప్రాతఃకాలపు దినచర్యలో ప్రథమభాగంగా వెంకటేశ్వర సుప్రభాతం చదివి వాకిట్లో కొచ్చేసరికి ఎదురగా తోట చివరి వసారాలోంచి పసిపిల్లని ఏడుపు వినిపిస్తూ వుంది.

"ఒరేయ్ నాయనా ఊరుకోరా, పంతులుగారు లేవంగానే పాలు తెచ్చి పోత్తాను" అంటూ సముదాయిస్తోంది మంగమ్మ.

"ఏమే మంగీ. కృష్ణ ఏడుస్తున్నాడా" పిల్చాడు రామశాస్త్రి. ఏడుపు ఠక్కున ఆగిపోయింది.

"పంతులుగోరూ, వత్తున్నానండో, అమ్మగోరు లెగిసిన్రా" చీకటిని పీల్చుకుంటూ ఒక పల్చని స్వరం రామశాస్త్రి చెవుల్ని తాకింది. ఆ వెనకనే యాభైసంవత్సరాల పనిమనిషి మంగమ్మ వరండాను చుట్టి దొడ్డివైపు పరుగెత్తింది.

రామశాస్త్రి మౌనంగా తలపంకించాడు. దీనికి పనిచేయడం తప్ప, రెండో విషయం తెలియదు. ఇదే విధంగా దేశమంతటా ఉంటే సోమరిపోతులకు స్థానం ఉండదు. దేశం బీదరికపు హస్తాల్లోంచి స్వేచ్ఛగా బయటపడేది'' అనుకొన్నాడు.

ఆ ఊరి యువకులంతా రామశాస్త్రి మాటలను ఎదిరించి ఒక్క అడుగు ముందుకు వేయరు. అయన ఒకరికి సలహా ఇచ్చే ముందు తను ఆచరించి మరీ చెప్తాడు. వ్యవసాయదారులకు, ఉద్యోగస్తులకు, విద్యార్థులకు ఎవరికి ఏసలహాలు చెప్పాలో ఆయనకు బాగా తెలుసు.

ఆయన ప్రతి సాయంకాలం ఊరిమధ్య రచ్చబండమీద కూర్చొని శాస్త్రాలు చెబుతాడు. వృద్ధులు, పిల్లలు. స్త్రీలు ఒకవైపు రైతులు, మిగతా కూలీలు, మరొకవైపు చాపలు, పరచుకొని కూర్చొంటారు. మునసబు. కరణము, ప్రెసిడెంటు, మిగతా ఒకరిద్దరు పెద్దలు అచే అరుగులమీద ఆ చివర కూర్చొంటారు. ఆయన ఒక్క రామాయణ, భారత, భాగవతాలేగాక కలియుగ పురుషులైన గాంధీమహాత్ముడు, సుభాన్‌చంద్రబోస్, వల్లభాయి పటేల్, నెహ్రూ, లాల్‌బహదూర్‌శాస్త్రివంటి రాజకీయ పితామహుల కథలు. రవీంద్రనాథ్‌ఠాగూర్, సరోజనీదేవి, శరత్ రచన నలవిశిష్టత. గురజాడ అప్పారావు జాతీయ భావాలు, కందుకూరి వీరేశలింగం సంఘ సంస్కరణలను ఆయన వివరిస్తారు. ప్రస్తుతం

దేశంలోని రాజకీయ పరిస్థితులుగూడా వారికి అర్థమయ్యే రీతిలో కథలు కథలుగా చెబుతుంటాడు.

రామశాస్త్రి ఖద్దరుధోవతిని గోచిపోసి కట్టుకొన్నాడు. తెల్లని పరిశుభ్రమైన వస్త్రాన్ని భుజంచుట్టూ చుట్టుకొన్నాడు ఒకచేతిలో గాంధీజీ జీవితగ్రంధం, మరికొన్ని స్కూలు పుస్తకాలు, రెండవ చేతిలో వంకీ కర్ర పట్టుకొని ఉన్నాడు. తలమీద పగలూ, రాత్రికి ప్రతిరూపాలుగా తెలుపూ, నలుపూ, వెంట్రుకలు కలగాపులగంగా కలిసి ఉన్నాయి. ఎర్రని శరీర ఛాయతో ముఖాన సింధూరంతో, ప్రాతఃకాలపు రేయెండకు ఆజానుబాహువైన అతని శరీరం విష్ణువు ప్రతిరూపంలా మెరిసిపోతూ ఉంది.

తపస్సుకు మెచ్చి వరమిచ్చిన దేవుడిలా ఏడ్చి ఏడ్చి శక్తి లేక నీరసంగా గుడిసెముందు చాపమీద పడుకొనిఉన్న తొమ్మిది నెలల కృష్ణ ముందు నాలుగడుగుల దూరంలో నిలబడ్డాడు రామ శాస్త్రి. వాడి ముఖంలోని తేజస్సును, కళ్లలోని కాంతిని పరిశీలి స్తున్న రామశాస్త్రి 'నువ్వు అమాయకుడివి. నా ఏడుపు విని ఎంత మోసపోయావు' అన్నట్లు బోసినవ్వులు నవ్వాడు వాడు నోరంతా తెరచి.

కాంతివంతంగా మండిన మనస్సు మరలా అంతలోనే చప్ప బడి పోయింది. ఒక్క నిట్టూర్పు విడిచాడు. 'వీడి జీవితం ఎలా ఉంటుందో! తన ఆశయాలకు ప్రతిరూపంగా దిద్దాలన్న తన కోరిక నెరవేరుస్తాడో, లేదో' అనుకున్నాడు.

అసలు ఎవరీ కృష్ణ? అని ప్రశ్నిస్తే జవాబు చాలా విచి త్రంగా ఉంటుంది. ఒక వర్షం వెలిసిన రాత్రి, తూరుపు కొండ సేపట్లో తెలతెల వారుతూందనగా గోపన్న మేకల దొడ్డి ఊడ్చ డానికి తడిక విప్పబోయాడు. కాని తన పాదాలదగ్గర తెల్లని వస్త్రంమీద కేరుకేరు మంటూ ఇంకో తెల్లని పసిబిడ్డ, రాత్రి ఉరి

మిన ఉరుముకు మెరుపు అంచుపట్టుకొని ఆకాశం నుంచి జారిన ప్రతిరూపం లాగుంది. అంతకుముందు రోజే కన్నబిడ్డ అర్ధాంతరంగా పోతే ఆ అగ్నిజ్వాలల్లో ఇంకా ఆరని కడుపు ఈ పసి కందును చూడగానే ఎందుకో చన్నీళ్లు చల్లినట్లయింది, పనంతటితో ఆపి పసికందును చేతుల్లో తీసుకెళ్లి భార్యకు చూపించాడు. ఆ బిడ్డను చూసి, అతని భార్య గుండెల్లోంచి మమత పాలు పొంగి వాటికవే స్రవించసాగాయి.

మరునటిరోజు ఉదయం జరిగిన సమావేశంలో ఊరి వాళ్లంతా పాల్గొన్నారు. ఆబిడ్డ ఎవరూ అన్నవిషయం ఎవరూ చెప్పలేకపోయారు. చివరకు గోపన్న తనే పెంచుకుంటానన్న తరువాత ఆ సమస్య తేలిగ్గా పరిష్కరింపబడింది, కాని ఆబిడ్డ ఎవరూ అన్నవిషయం అపరిష్కృతంగా ఉండిపోయింది. మూడవ తరగతి చెప్పే పెళ్లికాని పంతులమ్మ రజనికి, పట్నంలో మెడిసన్ చదువుతున్న సూర్యప్రకాశరావుకి సంబంధం అంటగట్టారు కొందరు. ఇద్దరూ ఆదివారాల రోజుల్లో ఒకరి నొకరు విడిచిపెట్టకుండా మాట్లాడుకోవడం, సాయంకాలంపూట షికార్లకు పోవడం, ఉన్నట్లుండి రజని స్కూలునుంచి మాయంకావడం ఇందుకు సాక్ష్యం అంటారు. బిడ్డను గోపన్న తనస్వంతం చేసుకొన్న రాత్రే రజని, ఆత్మహత్య చేసుకొన్నట్లు పట్నంనుంచి వార్తరావడం, అది తెలిసి సూర్యప్రకాశరావు గుండె పగిలేలా ఏడ్వడం అందరికీ రకరకాల అనుమానాలు రేకెత్తించాయి

రామశాస్త్రికి ఇద్దరూ తెలుసు. తను హెడ్మాస్టరయితే, రజని మూడవ తరగతి టీచరు. మంచి భావాలున్న వ్యక్తి. ఆమె నిజాయితీ తనకు తెలుసు. ఇక సూర్యప్రకాశరావు నిప్పులాంటి మనిషి. తన శిష్యుడు. తప్పుచేయడు. ఎందుకైనా మంచిదని ఈ విషయం కదిపాడు.

"మాస్టారూ! నన్ను నమ్మండి. రజనికి నేను అంత ద్రోహం చేస్తానా. నేను ప్రేమించిన మాట నిజమే. కాని ఆమె అర్ధాంతరంగా ఉద్యోగానికి రాజీనామా ఇచ్చివెళ్ళడం, తరువాత ఇలా మరణించడం నాకేం అర్థం కావడంలేదు" అన్నారు.

అలాంటి పరిస్థితుల్లో గోపన్న ఇంటిదగ్గర పెరుగుతున్న కృష్ణకు వచ్చిన కష్టం అతని జీవిత మార్గాన్నే వేరొక మలుపు త్రిప్పింది. కృష్ణకు తొమ్మిది నెలలు రాగానే ఒకరోజు జ్వరం వచ్చింది. తగ్గిపోతుందిలే అని ఏవో మందులు వాడారు. రెండు రోజుల తరువాత జ్వరం పోతూపోతూ కృష్ణను ఒంటికాలివాణ్ని చేసిపోయింది. కృష్ణకు ఎడమ కాలుకు పోలియో అటాక్ అయింది.

స్కూలు వదిలింతర్వాత ఇంటికి వెళ్తున్న రామశాస్త్రి గోపన్న ఇంట్లోంచి వస్తున్న ఏడుపులు విని ఆగి లోపలికి ప్రవేశించాడు. "సామే నాజీవితం ఇంకేంగాను కృష్ణ కుంటోడయి పోయిండు. ఆడికాలు దేవుడెత్తుకుపోయిండు. నానెలాసాకి ఈడ్ని పోసించేది. మేం ముసిలోళ్లమయితే మాకు కూడు ఎవరు ఎడ్తరు. ఈడుమాకు ఆధారంఅనుకొంటే, ఆడికి మేము ఆదారమయ్యాము" రామశాస్త్రి కాళ్ళమీద పడి ఏడ్చారు గోపన్న. గోపన్న భార్య నేలమీదపడి దొర్లుతూ ఏడుస్తూఉంది. రామశాస్త్రి కృష్ణ కాలుపట్టుకొని చూచాడు. తోటకూరకాడలా చలనం లేకుండా వాలిపోతూ ఉంది.

రామశాస్త్రి తనే కొంత ఆర్థిక సహాయంచేసి, బండి కట్టించి గోపన్నను, అతని భార్యను అందులో ఎక్కించి పిల్లవాడిని చూపించమని పదిమైళ్ళలో ఉన్న టౌనుకు పంపాడు. కాని ఫలితం శూన్యం. డాక్టర్లు ఇక అది నయంకాదన్నారు. నిరాశతో తిరిగి వచ్చారు గోపన్న దంపతులు. ఒకరోజు స్కూలుకుపోతూ క్రింద మట్టిలో అనాధలా పొర్లాడుతున్న కృష్ణను చూసి అతని మనసు

ద్రవించిపోయింది. తెల్లగా, బొద్దుగా ఎప్పుడూ నవ్వుతూ కని పించే కృష్ణ ఇప్పుడు సన్నగా ఎండిపోయి ఉన్నాడు. కళ్ళలో కాంతి తరిగిపోయింది. ఒక కాలు ఈడ్చుకుంటూ ఇంటిముందు మైదానంలో పొర్లాడుతున్నాడు.

కృష్ణను తనవద్ద ఉంచుకోవడం గోపన్నకు ఇష్టంలేదని తెలుసుకొన్న రామశాస్త్రి తన ఇంటి ఆవరణలో గుడిసె వేసుకొని ఉంటున్న పనిమనిషి మంగమ్మకు వాడ్ని అప్పగించాడు. దానితో పీడవదలిపోయింది గదాని గోపన్న ఎగిరి గంతేశాడు. గ్రామప్రజలు తననెందుకు గౌరవిస్తున్నారో రామశాస్త్రికి తెలుసు తన పద్ధతులు, సంస్కారం ఇవే కారణం. కృష్ణని తనఇంట్లో పెట్టుకొంటే ఊరిలో కట్టుబాటు తెగిపోతుంది, ఊరు చిన్నాభిన్నమైపోతుందనేది అతని భయం. దేవుడు గుడిలో అదృశ్యంగా ఉంటే భయపడుతున్న ప్రజలు, అతను నిజంగా మనుషుల రూపంలో గ్రామంలో నివ సిస్తూ ఉంటే అయన్ను ఖూనీచేయడానికైనా సాహసించరీ ప్రజ లని అతనికి తెలుసు. కృష్ణ బాగోగులకు ఆర్థికంగా సహాయం చేయసాగాడు రామశాస్త్రి.

కాలం చకచకా జరిగిపోతూ ఉంది. కృష్ణకు ఇప్పుడు ఎని మిది సంవత్సరాలు. ఉదయం అయిదున్నర గంటలకు నిద్ర లేస్తాడు. కాలకృత్యాలు తీర్చుకొని పూజచేస్తాడు. తరువాత ఏడు గంటల వరకు చదువుతాడు. తరువాత ఒకగంట తోటపని. మంగమ్మ నీళ్ళు తెచ్చి పోస్తూంటే చెట్లన్నిటికీ బోదెలు చేస్తాడు. తరువాత ఏచెట్టుకయినా చీడపట్టిందేమోనని ఒకసారి చెట్లన్నిటిని పరిశీలించి చూస్తాడు. ఒకప్పుడు మైదానంలోఉన్న నలభై అంకణాల రామ శాస్త్రి ఇంటి ముంగిలి ఇప్పుడు రకరకాల పూలచెట్లతో ఒకవైపు, మరోవైపు రకరకాల కూరగాయలచెట్లతో నిండివుంది.

కృష్ణ నాలుగవ తరగతి చదువుతున్నాడు. వాడి తెలివికి విషయ పరిజ్ఞానానికి రామశాస్త్రి ఆశ్చర్యపోతున్నాడు. సంవత్సరం సిలబస్ రెండు నెలల్లోనే పూర్తిచేసి 'ఏం చెయ్యాను మాస్టారూ' అని అడిగేవాడు. ఎక్కడ ఏది అడిగినా ఠకీమని చెప్పేవాడు తెలుగు పద్యాలు ఒకటి అడిగితే అన్నీ ఏకరువు పెట్టాడు. ఇక మాస్టారు ఏం చెప్పగలడు?

"ఒరే కుంటోడా" అని పిల్లలెవరన్నా పిలిస్తే సంక క్రింద కర్రతో వెనక్కి తిరిగి చూసేవాడు "ఏరా శీనూ" అనేవాడు. పిల్లలంతా 'కుంటోడు! కుంటోడు!!' అంటూ ఎగతాళి చేసేవారు. "అవున్రా! నేను నిజంగా కుంటోణ్నేగదా నన్నలాగే పిలవండి" అనేవాడు దాంతో పిల్లలంతా నిరాశపడిపోయేవారు. వాడు ఎదురుతిరిగి తిడితే, అందరూ కలిసి వాణ్ణికొట్టి నవ్వుకోవాలని వాళ్ళ ఉద్దేశం కాని వాళ్ళ కోరిక నెరవేరేది కాదు.

"నీకు అమ్మా! నాన్న లేరురా! దిక్కులేనివాడివి" ఆఖరి అస్త్రం ప్రయోగించేవాళ్ళు.

"ఒరే మీకు ఒక అమ్మ, ఒక నాన్నఅయితే. ఈ ఊళ్ళో అందరూ నా అమ్మా, నాన్నలేరా. శీనూ! మొన్న మీ అమ్మ నాకు పప్పులు పెట్టిందిరా! గుర్నాధం మీనాన్న నేను వస్తూంటే ఏదైనా కొనుక్కోమని రూపాయిచ్చేడురా! శంకరంగాడి అన్నయ్య నన్ను పిల్చి నాలుగు గోళీకాయలిచ్చేడురా!.... ఇంతమంది నాకున్నారు గదా! దిక్కులేనివాళ్ళకు దేవుడే దిక్కని మా మాస్టారు చెప్పారు గదరా" అంటూ నవ్వుతూ చెప్పేవాడు. చాటుగా ఎప్పుడో, ఏ అర్ధ రాత్రో అన్నీ గుర్తుచేసుకొని ఒక కన్నీటిబొట్టు వదిలేవాడు.

ఇవన్నీ రామశాస్త్రి గమనిస్తూనే ఉన్నాడు. కర్రసాయం తోనే కృష్ణ, రామశాస్త్రిగారి ఇంటిముందు పూలచెట్లచుట్టూ, కాయ

గిన సంగతి. ఆ ఇద్దరిలో మొదటి వ్యక్తి వార్డెను, రెండవ వ్యక్తి వంటవాడు....ఏమంటావు గురవయ్యశెట్టీ' అన్నాడు.

సత్యం వెనుకనే ఉన్న గురవయ్యశెట్టి ముందుకు వచ్చాడు. వార్డెను ఉరిమి చూశాడు. "నన్నేం సెయ్యమంటారయ్యా! ఈసిన్న బ్బాయ్య పోలీసోళ్ళకు పోను సేత్తనంటే నిజం ఒప్పేసుకొన్నా" అన్నాడు గురవయ్యశెట్టి నిర్దాక్షిణ్యంగా.

కాబట్టి మాస్టారూ! నిజం ఎప్పుడూ నిజంగానే రుజువవు తుంది. అందుకు ఈ సంఘటనే నిదర్శనం. ప్రస్తుతానికి గాయం మానిపోయింది. సెలవుల్లో వస్తాను. అమ్మగారి క్షేమ సమాచా రాలు అడిగినట్లు చెప్పండి. మా మంగమ్మత్తను అడిగానని చెప్పండి.

మీ ఆశీర్వాదలను కోరుతూ,

సదా మీ అడుగుజాడల్లో నడిచే

మీ

కృష్ణ,

రామశాస్త్రి కళ్ళ నుండి జలజల నీళ్ళు రాలాయి. నిన్న దేశ పరిస్థితుల్ని చూసి భయపడిన కృష్ణ ఈరోజు ఎంత ధయి ర్యంగా ఉంటున్నాడు. 'మాస్టారూ మహాత్ముడు జీవహింసచేయ రాదన్నాడుగా, ఎందుకు మనవాళ్ళు విధికొక మాంసం మార్కెట్ పెట్టారు. గాంధీ తాత మద్యపాన నిషేధం పెట్టాడు గదా మరి ఎందుకు మనం గాంధీపేరుతోనే బ్రాందీషాపులు తెరుస్తున్నాం. అయన చేనేత వస్త్రాలు ధరించమంటే మనం ఇంపోర్టెడ్ బట్టలు తప్ప మరేం వాడడంలేదు. మాస్టారూ మొన్నొకసారి మీటింగులో మహాత్ముడి శిష్యుడనని చెప్పిన వ్యక్తిని నిన్న మర్డర్ చేసాడనే నేరంపై పోలీసులు తీసుకుపోయారు' అంటూ అమాయకంగా అడిగేవాడు కృష్ణ.

"మాష్టారూ! కృష్ణని హాస్టలులో చేరుస్తాం. చాలా బాగుం టుంది. నేనూ పట్నంలో ఉంటున్నాను కాబట్టి వాడి బాగోగులు చూసుకొంటాను" అన్నాడు. అంతే! మరో పదిరోజుల్లో హైస్కూల్లో ఫస్ట్‌ఫారంలో చేర్పించాడు. హాస్టల్లో మకాం, రామశాస్త్రి హాయిగా గాలి పీల్చాడు.

కాని, తరువాత పదిహేనురోజులకల్లా చేతిసంచితో వచ్చిన కృష్ణ, "మాష్టారూ! నేనిక స్కూలుకు పోను" అనే సరికి రామశాస్త్రి ఆశయాలకు అనకట్ట పడింది. చివరకు "ఏంనాయనా? ఏమైంది?" అంటూ అడిగాడు.

హాస్టలులో పిల్లలంతా ఏడిపిస్తున్నారు మాష్టారు! ఒకడు నా పుస్తకం చించేశాడు. ఇంకొకడు నడూస్తుంటే కర్ర లాగేశాడు. మరొకడు నా భోజనం ప్లేటు దాచేశాడు. నిద్రపోతూంటే చెవిలో నీళ్ళు పోస్తున్నారు. నేనిక్కడే తోటపని చేసుకుంటూ బ్రతుకు తాను మాస్టారూ" వాడి కళ్ళలోపలి పొరల్లోంచి కన్నీళ్ళు ఉబికాయి.

రామశాస్త్రి హృదయం చిన్నగా మూలిగింది. లేని చిరు నవ్వు తెచ్చుకొని, "నాయనా కృష్ణా తెలివిగల వాడివిరా నువ్వు. మనిషికి పట్టుదల కావాలిరా. గాంధీమహాత్ముడు నీలాగే అనుకొని వుంటే మనకీనాడు స్వాతంత్ర్యం వచ్చేదా ఆయన దక్షిణాఫ్రికాలో పడ్డకష్టాలు తలచుకో. అంతకంటే ఎక్కువా నీవి. సర్దార్ వల్ల భాయిపటేల్ చొక్కా విప్పి తుపాకికి ఎదురుగా గుండె చూపిన రోజు గుర్తుతెచ్చుకో. వీరేశలింగంపంతులు ఎన్నో అవమానాల్ని అడు గడుగునా పొందుతూ ఎంతమంది వితంతు జీవితాల్ని పుష్పింప జేశాడు.... వాళ్ళ కష్టాలు మనం ఆలోచిస్తున్నామా! వాళ్ళ త్యాగాల్నే కదా మనం గుర్తుచేసుకొనేది.... ఇంతకీ నే చెప్పొచ్చేదే

మంటే, మనిషికీ కావలసింది మొదటిది పట్టుదల. రెండవది త్యాగం. అంతే నాయనా! అంతే. బాగా ఆలోచించుకో" అన్నాడు.

రామశాస్త్రి మాటలు కృష్ణ మెదడులో ప్రవేశించి, అణు వణువూ ప్రాకాయి. మాస్టారుగారికి నమస్కారంచేసి దృఢదీక్షతో వెనుకకు మరలాడు తను కోరి వాడ్ని కష్టాల్లోకి పంపిస్తున్నాడేమో నని ఒక్క క్షణం అనుకొన్నా, తరువాత తనకు అటువంటి ఆలో చన వచ్చినందుకు చింతించాడు.

పూజ్యనీయులైన మాస్టారు గారిక్ర,

నమస్కారం మాస్టారూ! ఈ పరీక్షల్లో తప్పక ఫస్ట్ క్లాస్ వస్తుంది. కారణం నాలాంటివాళ్ళు డిస్టింక్షన్ కోరుకోవడం తప్పు కాబట్టి.

మాస్టారూ పదిరోజుల క్రితం ఒక విషయం జరిగింది. నాకెందుకో ఆరోజు నిద్రపట్టలేదు. నానా అవస్థపడుతున్నాను. ఇంతలో స్టోరురూములోంచి ఏదో శబ్దం వినిపించింది. లైటు వేశాను. గోడగడియారం ఒంటిగంట చూపిస్తోంది. నాకెందుకో అనుమానం వచ్చి లైటార్పి మేముండే బిల్డింగుకు కొద్దిదూరంలో ఉన్న స్టోరు రూమువైపు నడిచాను. ఆ చీకటిలో రూములో లైటు వెలుగుతుందవేందుకు గుర్తుగా మూసిఉన్న కిటికీ సందుల్లోంచి ఎర్రని వెలుగు కనిపిస్తోంది. లోపలికి చూశాను. ఆశ్చర్యంవేసింది ఆ రోజు సాయంత్రమే పిల్లలందరికీ నిజాయితీగుర్చించి ఉపన్యాసం చెప్పిన వార్డనే స్టోరురూములో ఉన్న సరుకుల్లో సగం సగం వంట వాడి సహాయంతో బస్తాల కెక్కిస్తున్నాడు.

నేను ఆవేశంతో ముందువైపు వెళ్ళి స్టోరురూము తలుపులు తట్టాను. లోపల లైట్లు ఒక్కసారిగా ఆరిపోయాయి. పది నిముషా లయినా తెరచుకోలేదు. నాకు కోపం వచ్చింది. "మిష్టర్ వార్డన్! నువ్వూ, వంటవాడు మర్యాదగా బయటకు రండి. లేదంటే హాస్టల్లో

పిల్లలందర్నీ లేపి తీసుకువస్తాను" అన్నాను. ఠక్కున తలుపులు తెరచుకొన్నాయి వెంటనే నా తలమీద పిడుగుపడ్డట్లయింది. కళ్ళు తెరచేసరికి హాస్పిటల్ బెడ్‌మీద ఉన్నాను.

ఉత్తరం చదువుతున్న రామశాస్త్రి చేతులు వణికాయి

"... నువ్వు హాస్టల్లో దొంగతనం చేస్తూంటే పట్టుకొన్నారు. స్టోరురూము తాళాలు నాదగ్గర కొట్టేసి ఇంతపని చేస్తావా. నేను నిజాయితీ గురించీ చెప్పింది ఇదేనా" నా ప్రక్కనే ఉన్న వార్డను గద్దించాడు. "ఆయన దొంగతనంచేస్తూంటే నేను చూశాను సార్" వంటవాడు అందుకొన్నాడు. డాక్టరుతోసహా, అందరూ నావైపు ప్రశ్నార్థకంగా చూశారు. అక్కడేఉన్న హెడ్మాస్టరు వాళ్ళమాటలు నమ్మలేదు. సరికదా ! ఈవిషయం తహశిల్దారువరకూ తీసికెళ్ళి ఎంక్వయిరీ చేయించాలన్నాడు. నేను నిజం చెప్పడానికి నోరు తెరిచాను. కాని అశక్తితో ఏంచెప్పలేక హెడ్మాస్టరువైపు కృతజ్ఞతాపూర్వకంగా చూసి కళ్ళు మూసుకొన్నాను,

మళ్ళీ నేను కళ్ళు తెరిచేసరికి నాహాస్టలుమేటు సత్యం ఆవేశంగా చెప్పుకుపోతున్నాడు.... 'లైటు వెలుతురుకు కళ్ళుతెరిచాను. నేను పలుకరించే లోగానే లైటుఆర్పేసి చీకట్లో ఎక్కడికో బయలుదేరాడు కృష్ణ. వీడేంచేస్తాడా అనే కుతూహలంతో నేను వాడ్ని దూరంగా అనుసరించాను. వాడు స్టోరురూమువైపుపోవడం, కొంతసేపటికి 'అమ్మా' అని గావుకేకపెట్టడం విన్నాను. దాంతో హాస్టలు పిల్లలు చాలామంది నిద్రలేచారు. స్టోరు రూములోంచి బయటకు వచ్చిన ఇద్దరు వ్యక్తులూ గోడ అంచునే నక్కుతూ నక్కుతూ గేటు వరకూ వచ్చారు. తాము మోసుకొచ్చిన రెండు బస్తాలు పిట్టగోడ మీంచి రోడ్డుమీదికి నెట్టేశారు. తరువాతవాళ్ళు గేటు దూకారు. చీకట్లో రెండు బస్తాలు గురవయ్యశెట్టి ఇంట్లో చేరాయి. ఇదీ జరి

గిన సంగతి. ఆ ఇద్దరిలో మొదటి వ్యక్తి వార్డెను, రెండవ వ్యక్తి వంటవాడు....ఏమంటావు గురవయ్యశెట్టీ' అన్నాడు.

సత్యం వెనుకనే ఉన్న గురవయ్యశెట్టి ముందుకు వచ్చాడు. వార్డెను ఉరిమి చూశాడు. "నన్నేం సెయ్యమంటారయ్యా! ఈసిన్న బ్బయ్య పోలీసోళ్ళకు పోను సేత్తనంటే నిజం ఒప్పేసుకోన్నా" అన్నాడు గురవయ్యశెట్టి నిర్దాక్షిణ్యంగా.

కాబట్టి మాస్టారూ! నిజం ఎప్పుడూ నిజంగానే రుజువవుతుంది. అందుకు ఈ సంఘటనే నిదర్శనం. ప్రస్తుతానికి గాయం మానిపోయింది. సెలవుల్లో వస్తాను. అమ్మగారి క్షేమ సమాచారాలు అడిగినట్లు చెప్పండి. మా మంగమ్మత్తను అడిగానని చెప్పండి.

మీ ఆశీర్వాదలను కోరుతూ,

సదా మీ అడుగుజాడల్లో నడిచే

మీ

కృష్ణ,

రామశాస్త్రి కళ్ళ నుండీ జలజల నీళ్ళు రాలాయి. నిన్న దేశ పరిస్థితుల్ని చూసి భయపడిన కృష్ణ ఈరోజు ఎంత ధయిర్యంగా ఉంటున్నాడు. 'మాస్టారూ మహాత్ముడు జీవహింసచేయరాదన్నాడుగా, ఎందుకు మనవాళ్ళు విధికొక మాంసం మార్కెట్ పెట్టారు. గాంధీ తాత మద్యపాన నిషేదం పెట్టాడు గదా మరి ఎందుకు మనం గాంధీపేరుతోనే బ్రాందిషాపులు తెరుస్తున్నాం. అయన చేనేత వస్త్రాలు ధరించమంటే మనం ఇంపోర్టెడ్ బట్టలు తప్ప మరేం వాడడంలేదు. మాస్టారూ మొన్నొకసారి మీటింగులో మహాత్ముడి శిష్యుడనని చెప్పిన వ్యక్తిని నిన్న మర్డర్ చేసాడనే నేరంపై పోలీసులు తీసుకుపోయారు' అంటూ అమాయకంగా అడిగేవాడు కృష్ణ.

"ఏం చెప్పను నాయనా. ప్రజలంతా స్వార్థపరులు. మహాత్ముల పేరును ఇలా వాళ్ళ స్వార్థానికి వాడుకొంటారు. చెప్పేది ఒకటి. చేసేది ఒకటి దేనికీ పొత్తుండదు" అలా సర్దిచెప్పేవాడు.

అటువంటి కృష్ణ.... నవ్వుకొన్నాడు. కాని అంతలోనే కృష్ణకు తగిలిన దెబ్బ గుర్తుకొచ్చి పట్నం ప్రయాణమయ్యాడు.

"కృష్ణా....కృష్ణా" అంటూ గావుకేకలు పెట్టాడు రామశాస్త్రి. తోటలో సంక క్రింద కర్ర ఆధారంతో వంగి వంకాయలు తుంచి బుట్టలో వేస్తున్న కృష్ణ ఆశ్చర్యంగా "ఏం మాస్టారూ" అన్నాడు.

"నువ్వు టెన్త్‌క్లాస్ ఫస్టు వచ్చావు కృష్ణయ్యా" అంటూ చేతిలోని పేపరు అవతలపడేసి కృష్ణను కౌగిలించు కొన్నాడు. ఆ ఊపుకు అతని చేతిక్రింద కర్ర జారిపోయింది.

"నాయనా నీ ఆధారమైన ఆ కర్ర తీసిస్తాను. నన్నువదులు" అన్నాడు రామశాస్త్రి.

"వద్దు మాస్టారూ ఆ ఆధారం తాత్కాలికం. ఈ ఆధారం శాశ్వతం. నేనేదయినా అభివృద్ధిలోకి వస్తే అదంతా మీ చలవే" అంటూ కౌగిలిలోంచి క్రిందికి జారి రామశాస్త్రి పాదాలను కళ్ళకు అద్దుకొన్నాడు సజల నయనాలతో.

"కృష్ణా నీకో విషయం ఎన్నో రోజుల నుంచి చెప్పాలను కొంటున్నాను నాయనా. నీకోసం కులం, మతం లాంటి సంఘపు కట్టుబాట్లను ఎప్పుడో తెంచేశాను. ఈరోజునుంచినువ్వు మాఇంట్లోనే ఉండు" కృష్ణను పైకిలేవదీసి ఆప్యాయంగా అన్నాడు రామశాస్త్రి.

"వద్దు మాస్టారూ వద్దు, మంగమ్మత్త ఇంట్లో ఉంటున్నా పోషించేది మీరేగా. నన్నక్కడే ఉండనివ్వండి మాస్టారూ" అంటూ బతిమాలుకున్నాడు కృష్ణ తను మాస్టారి ఇంట్లోఉంటే జరగబోయే పరిణామాల్ని ఊహించుకొని.

టెన్త్‌క్లాసులో ఫస్టువచ్చినందుకు రాష్ట్రప్రభుత్వం రెండు వేల రూపాయలు అవార్డిచ్చింది. కృష్ణవద్దంటున్నా వినకుండా దానికొక వేయి జతచేసి పట్నం బ్యాంకులో కృష్ణపేరిటవేసి వాన్ని వాడుకోమన్నాడు రామశాస్త్రి. హాస్టల్లో చదువుకు ఎన్నో అంత రాయాలుంటాయని, ప్రత్యేకంగా ఒక రూము ఏర్పాటుచేసి దగ్గరలో మెస్సు కుదిర్చాడు.

కాలం జరజర ప్రాకే త్రాచుపాములా సాగిపోతూ ఉంది. ఇప్పుడు కృష్ణకు ప్రత్యేకమైన గది ఉండడంతో రాత్రి, పగలు చదువులో మునిగిపోయాడు. ఇంటర్మీడియట్ డిస్టింక్షన్‌లో పాస య్యాడు. డిగ్రీలో యూనివర్శిటీ ఫస్టు రావాలని అతని ఆశయం.

లెకరర్లకు ఇతనంటే మంచి అభిమానం. విద్యార్థులు కృష్ణను ఎంతో గౌరవిస్తారు, డిబేట్స్‌లో ఇతని ఉపన్యాసాలకు ఎగ బడతారు. సెమినార్స్‌లో ఇతని సలహాలకు చెవికోసు కొంటారు.

ఏపుగా పెరిగి, గుబురు మీసాలతో, గిరిజాల జుట్టుతో ఆరోగ్యంగా ఎర్రగా నిగనిగలాడుతున్న అతని శరీరాన్ని ఆద్యంతము కళ్లతోనే స్పర్శిస్తాడు రామశాస్త్రి. కాని తోటకూరకాడలా వ్రేలాడుతూ పాంటులో దూరిఉన్న ఎడమకాలు చంద్రునికో మచ్చలా ఉంది.

ఒకరోజు కాలేజి డిబేట్‌లో స్త్రీ స్వాతంత్ర్యం అనే టాపిక్ మీద ఉపన్యసించి వస్తున్నాడు కృష్ణ. అది చీకటి రాత్రి. కాలేజి గార్డెన్ దగ్గరకొచ్చేసరికి అశోకవృక్షం, దాని ప్రక్కనున్న పొదల్నుంచి ఏవేవో శబ్దాలు, కీచుగొంతులు వినిపిస్తున్నాయి. కృష్ణ శబ్దంకాకుండా కొమ్మలను తొలగించుకొని కొద్దిదూరంనడచి ఆకుల సందుల్లోంచి చూసాడు. ఆ ప్రదేశంలో నలుగురు వ్యక్తులు నిల బడి ఉన్నారు. నలుగురి చేతుల్లోనూ, నాలుగు టార్చిలైట్లు వెలుగుతున్నాయి. మధ్యలో ఒక స్త్రీ. ఆకాంతిలో ఆమె రెండు చేతులతో

గుండెను కప్పుకొని ఉంది. కారణం ఆమె చీర జాకెట్టు ఒకడి చేతిలో ఉన్నాయి.

"నన్ను వదులు డేవిడ్ బ్రదర్ నేనేం చేసానని నన్నిలా హింసిస్తున్నారు. మీరంతా మన కాలేజీ వాళ్లే నన్నెరిగినవారు. నన్ను వదలండి ఈవిషయం ఎవరికీ రిపోర్టుచేయనని ప్రమాణం చేస్తున్నాను" సిగ్గుతో ముడుచుకుపోయి ప్రాధేయపడుతోంది.

హ్హ....హ్హ....హ్హ. ..మేం నిన్నంత ఈజీగా వదలడానికి తీసుకురాలేదు. మేము నలుగురం. నీవు ఒక్కదానివి. ఇప్పుడు ఏకృష్ణుడు వచ్చి నీ మానాన్ని కాపాడుతాడో చూస్తాం" అన్నాడు ఒకడు. అందరూ నవ్వారు, రాక్షసుల్లా ఆమెమీదికి ఉరికారు.

కృష్ణలో ఆవేశం ముంచుకొచ్చింది. ఆమె ఎవరో కాదు. తన క్లాస్‌మేట్ దేవకీరాణి. వాళ్లలో ఇద్దరు తన క్లాస్‌మేట్స్. చెట్లను చీల్చుకొని ప్రవేశించాడు. సంకలోని కర్రతో నలుగురినీ గార్డెనంతా తిప్పి తిప్పి కొట్టాడు. సమయం చూసుకొని రోడ్డు మీదికి పరుగెత్తిన దేవకీరాణి అప్పుడే ఇళ్ళకు వెడుతున్న స్టూడెంట్సుకి ఈ విషయం చెప్పింది. అంతా ఒక్కుమ్మడిగా పరుగెత్తారు. రక్తపు మడుగులో పడివున్న కృష్ణ కనిపించాడు. కాని దుర్మార్గులు అంతులేరు

.... .... ....

టెలిగ్రాం అందగానే పరుగెత్తుకు వచ్చిన రామశాస్త్రికి గవర్నమెంటు హాస్పిటల్ లో తెల్లని బట్టలక్రింద నవ్వుతున్న కృష్ణ శవం దర్శన మిచ్చింది. శరీరంలో ప్రాణంలేదు. కాని నవ్వులో జీవం ఉంది.

"కృష్ణ గుర్తుగా మా కాలేజీలో 'కృష్ణా మెమోరియల్ డిబేట్ సెంటర్' కట్టిస్తున్నాం." అన్న ప్రిన్సిపాల్ మాటలు రామశాస్త్రి గుండెలో మాటిగా గుచ్చుకొన్నాయి.

"సార్! మీకు దణ్ణం పెడతాను. ఆపనిమాత్రం చేయకండి. నా కృష్ణ ఆత్మ శాంతించదు. వాడు మహాత్ముడు వాడికి కావల సింది సంఘంలో నిజమైన మార్పు. వీడి మరణంతో ఏ ఒక్క దుర్మార్గుడి మనసు మార్చుకొన్నా నాకు సంతోషమే. అంతేగాని వాడి గుర్తుగా శిలాశాసనాలు అక్కర్లేదు సార్" అన్నాడు.

నదులు ఎక్కడో పుట్టి సముద్రంలో కలుస్తున్నాయి. వాటి పుట్టుక గురించి ఎవరూ పట్టించుకోవాల్సిన అవసరం లేదు. కాని మానవాళికి అవి ఎంతవరకు ఉపయోగపడుతున్నాయనేది తెలుసుకోవలసిన విషయం!

నాలుగురోడ్లకూడలిలో గాంధీమహాత్ముని విగ్రహంముందు పిచ్చివాడిలా నిలబడి ఉన్నాడు రామశాస్త్రి. గాంధీమహాత్ముడి ఒక చేతిలో భగవద్గీత. మరొక చేతిలో కర్ర. ఒక కాలు ముందుకు వేశాడు, ఇంకొక కాలు వెనుక ఉంది. కళ్లజోడులోంచి చూస్తూ బోసినవ్వులు నవ్వుతున్నాడు.

"బాపూ. చూసావుగా. నీవు అభివృద్ధిపథంలోవేసిన అడుగు అంతటితో ఆగిపోయింది. రెండవ అడుగు పడలేదు. ఇంకొకసారి ఈలోకంలో మరలా జన్మించకు మహాత్మా. మరలా జన్మించకు'' తలను మహాత్ముని పాదాలకేసి కొట్టుకుంటూ బోరున ఏడ్చాడు రామశాస్త్రి.

పూజ్య బాపూజీ మరలా ఎందుకు పుడతాడు రామశాస్త్రి పిచ్చిగాని! మహాత్ములకు చావులేదు కనుక వారు మరలా జన్మించే అవకాశం లేదు. వారు జీవించి ఉన్నప్పుడే వాళ్లని ఆదరించాలి. వారి ద్వారా తమ జీవితాల్ని మార్చుకోవాలి. అంతే!

★

# చిగురించిన గులాబి

ఆ సాయంత్రం వరండాలో ఈజీచైర్‌లో కూర్చొని విశ్వం ఆలోచిస్తున్నాడు అతను బ్యాంకు మేనేజరుగా ఉద్యోగం చేస్తు న్నాడు. ఇంటిదగ్గర నుంచి పెళ్ళిచేసుకోమని వారానికో ఉత్తరం వస్తూ ఉంది. కాని అతని కిప్పుడిప్పుడే వివాహం చేసుకోవాలని లేదు. ఈరోజు ఉదయంకూడా అదే విషయంమీద తల్లిదండ్రుల దగ్గర నుంచి అందిన ఉత్తరం గురించి ప్రస్తుతం ఆలోచిస్తున్నాడు.

కొద్దిసేపటికి ఆలోచనలోంచి బయటపడి యధాలాపంగా తలెత్తి చూసాడు. ఎదురింటి డాబామీద చందమామలాంటి అమ్మాయి నిలబడి వీధిలోకి చూస్తోంది. ఆమె అందమైన ముఖం మీద చీకటి నీడలు తారాడుతూ గ్రహణంపట్టిన చంద్రుడిలా విచార కరంగా ఉంది. ఆభరణాలు ధరించకుండా సింపుల్‌గాఉన్న ఆమె ఎంతో అందంగా ఉంది. ఎంతసేపు చూసినా తనవితీరని అంద మామెది.

హఠాత్తుగా తలపైకెత్తి విశ్వంవైపు చూసిన ఆమె బెదిరిన లేడిలా తడబడే అడుగులతో హడావుడిగా వెళ్లిపోయింది. అతని కంటికి ఆమె శాపవశాన భూలోకంలో అవతరించిన దేవతలా అనిపించింది. ఎదురింట్లో పదిహేను రోజులక్రితం ఒకకుటుంబం వచ్చి చేరింది. అంతకుముందు ఆ ఇంట్లోవున్న ఇంజనీరుకు హైద రాబాదు ట్రాన్సఫరయి వెళ్ళిపోయాడు. ఇంతవరకు కొత్తవాళ్ళ గురించి తెలుసుకోని విశ్వానికి ఈరోజు ఆ అమ్మాయి పేరేమిటో ఏం చేస్తుందో తెలుసుకోవాలనే కుతూహలం పుట్టింది.

పదిరోజులు గడిచిపోయాయి. మళ్ళీ ఆ అమ్మాయి విశ్వం కంటికి కనిపించలేదు. విశ్వం నిరంతర పరిశీలనమీదట ఆ ఇంటి

యజమాని స్థానిక కాలేజీలో లెక్చరరని అతనికి కాలేజీకివెళ్ళే ఒక కొడుకు, కూతురు ఉన్నారని, వాళ్ళేగాక ఇంకా ఇద్దరు చిన్నపిల్ల లున్నారని తెలుసుకొన్నాడు. కాని మెరుపుతీగలాంటి ఆఅమ్మాయి ఎవరో గుప్తంగానే ఉండిపోయింది.

పనిమనిషి రత్తాలుద్వారా ఈ విషయం తెలుసుకోవాలను కొన్నాడు. కారణం రత్తాలు వాళ్ళింట్లోకూడా పనిచేస్తుంది.

మరుసటిరోజు గది ఊడ్చి కూజాతో నీళ్ళుపెట్టి వెళ్ళ బోతున్న రత్తాలును పిలిచాడు.

"ఏంది సారూ" అంటూ వచ్చి ఎదురుగా నిలబడింది.

"ఎదురింట్లో ఒక అమ్మాయిని చూసాను రత్తాలూ. ఎందుకో ఆమెను చూస్తూంటే చాలా కష్టాల్లో ఉన్నట్లు కనబడుతోంది" అన్నాడు విశ్వం, ఎలా మాట్లాడితే రత్తాలు ఏవిధంగా అర్థం చేసు కుంటుందోనని భయపడుతూ.

రత్తాలు ముఖం క్షణాల్లో మారిపోయింది.

"తమరు చూసారు గదా సామే ఆయమ్మగోర్ని" అంది రత్తాలు బాధగా.

అవునని తలాడించాడు విశ్వం.

"ఏం చెప్పేది సామే ఆ వసంతమ్మ గోరి గురించి. అదంతా ఒక పెద్దకత. ఆబిడ్డను సూస్తే గుండె తరుక్కొని పోతుందనుకో. ఆమెకు మూడేళ్ళకిందట పెళ్ళిజేసిన్రంట. పెళ్ళయిన నెలరోజు లకే ఆయమ్మ మొగుడు స్కూటరు యాక్సిడెంటులో సచ్చిపోయా డంట" కళ్ళుతుడుచుకొంటూ అంది రత్తాలు.

"అయ్యో పాపం ఎంతపని జరిగింది" తనకు తెలియ కుండానే మాటలు వెలువడ్డాయి విశ్వం నోట్లోంచి.

"బాద అదికాదు సామే. ఇప్పుడు ఆమె అనుభవించేదే అసలైన బాద. మొగుడుపోయి ఆమె కష్టాల్లో ఆముంటే ఇంట్లో పరిస్థితి ఇంకా గోరంగాఉండాది. ఆమె గాజులు తొడుక్కోగూడ దంట. నగలు ఏసుకోకూడదంట. బొట్టుఎట్టుకోకూడదంట. పూలు ముడుసుకోగూడదంట. ఇంకా గోరమయిన సంగతొకటి సెప్తాను. ఆమె అందరూ నిద్రలేచి సానాలు సేసేవరకూ ఎవురికంటా పడ కూడదంట. ఏమన్నాయం" అంది రత్తాలు ఉద్వేగంగా.

విశ్వం గుండె గుబులుగా కొట్టుకొంది.

"ఏమయినా ఇట్టాంటియి మాకులాల్లో లేవు సామే. మొగుడు పోతే కొంతకాలం బాదపడతాం. తరువాత మారు మనువాడుతం. మా పసుపూ కుంకమలు ఏడికిబోవు. ఆళ్ళు పెద్దోళ్ళు. నాలాంటిది ఆళ్ళకేం సెప్పగలదు. నాకు ఇంకా శానా పనులుండయి నానొత్తా సామే" అంటూ వెళ్ళిపోయింది రత్తాలు

రత్తాలు వెళ్ళిపోయిన తరువాత వసంత గురించే చాలా సేపు ఆలోచిస్తూ ఉండిపోయాడు విశ్వం. ఎలాగయినా వారికుటుం బంతో పరిచయం చేసుకొని ఆమెను ఈ మూఢనమ్మకాల చెర నుంచి తప్పించాలనుకొన్నాడు. కాని చొరవ తీసుకోవడం ఎలా?

వసంత గురించి రోజుకొక విషయం చెప్పేది రత్తాలు. భర్త పోయిన తరువాత ఇప్పటికీ సినిమా చూసి ఎరుగదట వసంత. 'శంకరాభరణం' సినిమా ఎంతోబాగుందని ఇంట్లో అందరూ అను కొంటూంటే వెళ్తానని అన్నదట. అంతే. ఆమె నాన్నమ్మ ఇంట్లో పెద్ద గొడవ చేసిందట. అమ్మా, నాన్న ఆమెను చీవాట్లేసారట. అంతే. ఆరోజు నుంచి ఒక్కసినిమామీదేకాదు. మిగతా అన్ని వినోద కార్యక్రమాలమీద విరక్తి చెందిందట. ఇవన్నీ రత్తాలుతో చెప్పుకొని కన్నీరు కార్చిందట. ఇంట్లో వాళ్ళకంటే పనిమనిషి

రత్తాల్నే ఆత్మీయురాలుగా చెప్పుకొనేదట. ఇవన్నీ చెప్పి తనూ బాధపడేది రత్తాలు.

ఆచారాల ముసుగులో క్షణం క్షణం నరకమనుభవించే ఈ సమాజం సృష్టించిన అగ్రకులాల సంకుచిత మనస్తత్త్వాల కంటే సర్వమానవ సౌభ్రాత్రాన్ని కాంక్షించే ఏ ఆచారాలు లేని తక్కువ కులాలుగా భావించేవారి విశాలహృదయాలు ఎంతమిన్న అనుకొన్నాడు విశ్వం.

ఇంకోరోజు రత్తాలు ఆమె గాన మాధుర్యాన్ని గురించి ఎంతగానో పొగిడింది విశ్వం ముందు. ఒకరోజు రత్తాలు బావి దగ్గర బట్టలు ఉతికి తీగెమీద ఆరేస్తుందట. ఆ సమయంలో కొద్ది దూరంలోనున్న బాదంచెట్టు పక్కనుంచి చెవులకు ఇంపైన గొంతు వినిపించిందట. అవి మీరాబాయి కృష్ణుని గురించి పాడే భక్తి గీతాలట. రత్తాలు అక్కడెవరో టేపురికార్డరు పెట్టుకొని వింటున్నా రనుకొందట. తీరా వెళ్ళిచూస్తే అవలివైపు చెట్టునానుకొని రాగం తీస్తుందట వసంత. ఆమె కళ్ళలోంచి కన్నీరు బుగ్గలమీదుగా కారి గుండెలమీద పడుతున్నాయట.

రత్తాలును చూసి తత్తరపడి కళ్ళుతుడుచుకొందట. ఆ సమయంలో రత్తాలు అనునయంమీద చెప్పిందట వసంత. తనకు భరతనాట్యంకూడా వచ్చని, అది చేయాలని ఎంతో ఉత్సాహమని, తన కోరిక నేరవేరడంలేదని బాధపడిందట.

ఇన్ని శుభలక్షణాలు గల వసంతను గురించి వింటూంటే విశ్వానికి లేనిపోని ఆవేశం వస్తోంది. ఎలాగయినా వాళ్ళను సంస్కరించి ఆమెకు విముక్తి కలిగించాలని ఉంది. కాని ఎలా వాళ్ళను పరిచయం చేసుకొని వాళ్ళు తనమాట వినేట్లు చేయాలి అనేది అతని బాధ.

ఒకరోజు అతనికి అతిచక్కని అవకాశ మొచ్చింది. ఆరోజు విశ్వం తన సీట్లో కూర్చొని పనిచేసుకొంటున్నాడు. ఇంతలో "నమస్కారంసార్" అంటూ ఒక వ్యక్తి ప్రవేశించాడు.

"నమస్కారం కూర్చోండి" అంటూ తలెత్తి చూసిన విశ్వాం ఆ వ్యక్తిని చూసి ఆశ్చర్యపోయాడు. అతను ఎదురింటి లెక్చరర్.

అతనుకూడా ఆశ్చర్యం ప్రకటిస్తూ "మీరు మా ఎదురింట్లో మేడమీద గదిలో ఉంటున్నారు కదూ" అన్నాడు.

ఇద్దరూ పరస్పర పరిచయాలు చేసుకొన్నారు. విశ్వం అటెండర్ని పంపి రెండు బ్రూకాఫీ తెప్పించి ఒకటి లెక్చరర్ నారాయణ మూర్తికి అఫర్ చేసాడు.

"ఏమిటి సార్ ఇలా వచ్చారు" అని అడిగాడు విశ్వం.

కొద్దిసేపు మౌనంగా ఉండి చెప్పాడు నారాయణమూర్తి. తన చిన్నకుమార్తె బి. ఎ. ఫైనల్‌లో ఉందని, ఆమెకు ఒక డాక్టరుతో సంబంధం కుదిరిందని, దానికిగాను యాభైవేలు కట్నం ఇవ్వాలని ఒప్పుకొన్నారట. ఇంట్లో అమ్మాయికి ఇవ్వాల్సిన బంగారం పోను, మిగతా గోల్డు తనఖా పెట్టుకొని లోను ఇవ్వమంటున్నాడు. అతను చెప్పిన బంగారాన్నిబట్టి ముప్పైవేలు వస్తుందని చెప్పాడు విశ్వం. యాభైవేలు ఇవ్వలేరా అన్నాడు జాలిగా. ఆలోచించి తరువాత చెబుతానన్నాడు విశ్వం. అతన్ని బాధపెట్టడం ఇష్టంలేక. మళ్ళీ వారంతరువాత వస్తానని చెప్పి వెళ్ళిపోయాడు నారాయణమూర్తి.

ఆ మరునటిరోజు ఉదయం స్నానంచేసి పక్కనున్న క్యాంటీన్‌లో టిఫిన్‌చేయడానికి వెళ్తుంటే అందుకోనమే వాకిట్లో నిలబడి ఉన్నట్లున్న లెక్చరర్ నారాయణమూర్తి "రండిసార్" అంటూ ఆహ్వానించాడు.

విశ్వం మారుమాట్లాడకుండా అతని వెంట లోపలికి వెళ్లాడు. నారాయణమూర్తి ఇంట్లో వాళ్ళందరినీ పరిచయం చేసాడు వసంతను తప్ప. వసంతకోసం గదంతా వెతికిన అతని కళ్ళు నిరాశ చేసుకున్నాయి. వద్దంటున్నా వినకుండా బలవంతంగా టిఫిన్ పెట్టారు. తిరిగి వస్తూంటే తన లోను సంగతి గుర్తుచేసాడు నారాయణమూర్తి. ఈరోజుల్లో కట్నాలేమిటండీ ఇచ్చేది అని అడుగుదామనుకున్నాడు విశ్వం. కాని అది వాళ్ళమీద ఎలాంటి ప్రభావాన్ని తెస్తుందోనని భయపడ్డాడు. వాళ్ళు ప్రిజుడిస్అయి ఇంకో బ్యాంకుద్వారా అప్పు తెచ్చుకోవచ్చు. అప్పుడు తనకు వీళ్ళ కుటుంబంతో కనెక్షన్ తెగిపోవచ్చు అనుకున్నాడు.

వసంత జీవితంలో వెలుగు నింపాలన్న దృఢనిశ్చయముండడంతో విశ్వం వాళ్ళతో ఏమీ వాదించదలచుకోలేదు. క్రమేణా పరిచయం పెంచుకుని వాళ్ళలో పరివర్తన తేవాలనుకొన్నాడు. అందుకే తన స్వంత పూచీమీదైనా మిగతా ఇరవైవేలు లోనుగా నారాయణమూర్తికి ఇవ్వాలనుకొన్నాడు.

రోజులు గడిచిపోతున్నాయి. ఇప్పుడు విశ్వం రోజూ రెండు పూటలా నారాయణమూర్తి ఇంటికి వెళ్ళివస్తున్నాడు వాళ్లింట్లో ఒక సభ్యుడిగా మెలుగుతున్నాడు. నాలుగురోజుల తరువాత నారాయణమూర్తి రెండవ కుమార్తెకు ముహూర్తాలు పెట్టుకున్నారు. ఆ మరునటి రోజే నారాయణమూర్తి తన దగ్గరున్న బంగారాన్ని బాంకులో పెట్టి ముప్పైవేలు, పర్సనల్ సెక్యూరిటీకింద ఇంకోఇరవై వేలు తీసుకొన్నాడు. లోను ఇచ్చిన రోజునుంచీ విశ్వాన్ని నెత్తిన పెట్టుకోసాగారు వాళ్ళు.

ఒకరోజు పనిమనిషి రత్తాలు వచ్చి చెప్పిన మాటలు విని నిర్ఘాంతపోయాడు విశ్వం. నారాయణమూర్తి తన చిన్న కుమార్తె పెళ్ళి సందర్భంగా వివాహానికి రెండు రోజుల ముందుగా వసం

తను దూరంగా బంధువుల ఇంటికి పంపివేయాలనుకొన్నారట. పెళ్ళయిన నెలతరువాత తిరిగి తీసుకురావలని నిర్ణయించుకొన్నారట.

ఈవిషయం రత్తాలుతో చెబుతూ కళ్ళనీళ్ళుపెట్టుకుందట వసంత "చూడు రత్తాలూ! నా అదృష్టం బాగులేక ఇలా మోడునయ్యానే అనుకో, శుభమా అంటూ పెళ్ళిచేసుకొనే నా చెల్లెలికి ఆ శుభం కలగాలని కోరుకుంటానా? పెళ్ళిబట్టల్లో పచ్చగా కళకళలాడే నాచెల్లెల్ని చూసుకోవాలని నాకుండదా. పెళ్ళిపందిట్లోకి రాకపోయినా చాటుగనయినా చూసి అనందిస్తాను కదా" అంటూ మొరపెట్టుకుందట.

తరువాత మెల్లిగా "రత్తాలూ! నువ్వా బాంకు ఆఫీసరుగారింట్లోకూడా పనిచేస్తావుగా. అయన మాటంటే మా ఇంట్లో వాళ్ళకు అంత గురి. నువ్వెట్లాగయినా వారితో చెప్పి నేను వెళ్ళకుండా ఉండేట్లుచేయి. కాని నేను ఆయన్ని అభ్యర్థించినట్లు ఉండకూడదు. పెద్దదానివి, నాబాధ అర్థంచేసుకో" అంటూ ఏడ్చిందట.

వసంత తండ్రి నారాయణమూర్తి ఆలోచన, వసంత అభ్యర్థన విన్నమీదట విశ్వం గుండె కరిగిపోయింది. వసంతమీద ఇంతని చెప్పలేని జాలి, అభిమానం ఏర్పడ్డాయి.

ఆ సాయంత్రం బ్యాంకునుండి వస్తూ స్కూటరు నారాయణమూర్తి ఇంటిముందు అపాడు. అప్పటికే నారాయణమూర్తి కాలేజీ నుంచి ఇంటికివచ్చి ఉన్నాడు.

"రండి సార్" అంటూ లోపలికి అహ్వానించాడు.

"ఫరవాలేదండీ. మీతో కొన్ని విషయాలు మాట్లాడాలి, అలా పార్కు వైపు వెడదాం వస్తారా" అన్నాడు విశ్వం అభ్యర్థిస్తున్నట్లు.

"నో అబ్జెక్షన్. అలాగే వస్తాను. అయితే కాఫీ తాగి వెళ్దాం" అన్నాడు నవ్వుతూ.

విశ్వం బయట స్కూటర్ లాక్‌చేసి లోపలికి వెళ్ళాడు. పది నిముషాల తరువాత ఇద్దరూ కాఫీ తాగి బయటకి వచ్చారు. విశ్వం స్కూటరు స్టార్టు చేసాడు. వెనుక కూర్చున్నాడు నారాయణమూర్తి. కొద్ది నిముషాల్లో వాళ్ళు పార్కు చేరుకొన్నారు

జనసంచారం లేనిచోట ఇద్దరూ ఒకరికెదురుగా ఒకరు కూర్చొన్నారు. కొద్దిసేపు ఇద్దరూ లోకాభిరామాయణం మాట్లాడు కొన్నారు.

"ఏదో విషయం మాట్లాడాలన్నారు" అంటూ గుర్తుచేసాడు నారాయణమూర్తి.

విషయం ఎలా మొదలుపెట్టాలా అని ఆలోచిస్తున్న విశ్వం "సార్. మీరు నే నేదడిగినా దాచకుండా చెప్తారుగా" అన్నాడు.

"తప్పకుండా" అన్నాడు నారాయణమూర్తి.

"మీకు ఎంతమంది ఆడపిల్లలండీ"

ఈ ప్రశ్నకు నారాయణమూర్తి బెదిరిపోయాడు.

"సారీసార్. మీకుటుంబ వ్యవహారాల్లో జోక్యం చేసుకొంటు న్నాను గదూ"

"నో .. నో....మిమ్మల్ని నేను పరాయివాళ్ళుగా భావించడం లేదు" అన్నాడు నారాయణమూర్తి.

"అయితే చెప్పండి."

"నాకు ఇద్దరు ఆడపిల్లలండీ."

"ఇంకొకామె కనిపించదే. ఆమె ఎక్కడుంది"

"ఏం చెప్పేదిలెండి మాపెద్దమ్మాయి వసంత సంగతి. దాని దురదృష్టం తలచుకొంటూ మేము దుఃఖించని రోజులేదు" అంటూ వసంత సంగతి యావత్తూ చెప్పాడు.

"దురదృష్టం ఆమె భూతకాలాన్ని చిన్నాభిన్నంచేస్తే, మీరు ఆమె భవిష్యత్తును అంధకార బంధురం చేసారు. నాలుగు గోడల మధ్య ఆమెను కూర్చోబెట్టి 'నువ్వు విధవవు. నువ్వు విధవవు' అని వేలెత్తి చూపుతూ ఆమెను క్షణంక్షణం హింసిస్తున్నారు" తనలోని ఆవేశం బయటపెట్టాడు విశ్వం.

విశ్వంమాటలకు నారాయణమూర్తిదెబ్బతిన్నట్లు చూసాడు.

"అవును సార్. పెళ్లయ్యాక భర్తద్వారా సంక్రమించేదితాళి మాత్రమే. భర్తపోతే తెంచేయాల్సింది తాళేగాని, మిగతావన్నీ త్యజించాల్నా?'' అంటూ తన మనసులోని విషయాలన్నీ బయట పెట్టేసాడు విశ్వం.

నారాయణమూర్తి బాగా రియలైజయ్యాడు విశ్వం చెప్పే ప్రతిపాయింటూ కరెక్టేనన్నట్లు తలఊపసాగాడు. అందుకే వసంతకు అందరితోబాటు సమాన స్వేచ్ఛను ఇవ్వమన్నాడు. అందరిలా అలంకరించుకొని ఈలోకంలో తిరిగేట్లు చేయమన్నాడు.

నారాయణమూర్తి కళ్ళలో నీళ్ళుతిరిగాయి. "ఈ సమాజం ఒప్పుకోదండీ విశ్వంగారూ, విధవరాలుకేమిటి షోకులు అంటూ నన్ను వేధిస్తారండీ. తలెత్తుకోకుండా ముఖం వాచేట్లు చీవాట్లు పెడుతుందండీ లోకం" అన్నాడు.

"షో, సమాజం మిమ్మల్ని పోషిస్తుందన్నమాట. మీరు ఉద్యోగం చేసుకొని మిమ్మల్ని మీరు పోషించుకోవడం లేదన్న మాట. మీకుమార్తె తన ఖర్మకు గుండెపగిలి ఏడుస్తూంటే సమాజం సంతోషిస్తుందన్నమాట. మీకు కావలసింది సమాజం సంతోషించడమే గాని మీకుమార్తె ఆనందం కాదన్నమాట. మీదెంత రాతి గుండె సార్, సమాజంకోసం రక్తం పంచుకుపుట్టిన బిడ్డ జీవితాన్ని కాలరాస్తారా'' ఈటెల్లాంటి ఆమాటలు నారాయణమూర్తి గుండెలో సూటిగా గుచ్చుకొన్నాయి. వినలేనట్లు చెవులు మూసుకొన్నాడు.

"సార్. మీరు చెప్పింది నిజమే, పచ్చగా కళకళలాడుతూ నాబిడ్డ నాక్కముందు తిరగడమే నాకు కావలసింది ఈ బోడి సమాజం ఏమనుకొంటే నాకేం, అయితే నా కుమార్తె జీవితంలో మంచిరోజులొస్తాయంటారా" అన్నాడు ఆశగా.

"తప్పకుండా. అయితే మీరామెను అందరిపిల్లల్లా చూసుకోండి. అందరిలా స్వేచ్ఛగా తిరగనీయండి. అసలు వివాహమే కాలేదనుకోండి." అంటూ నారాయణమూర్తికి చాలాసేపు హిత బోధ చేస్తాడు విశ్వం.

మరుసటిరోజు ఉదయం ఎనిమిదిగంటల ప్రాంతంలో విశ్వం బట్టలు వేసుకొని తయారై తల దువ్వుకొంటూంటే మంచినీళ్ల కూజాతో వచ్చింది రత్తాలు.

"సారూ. నువ్వు శానాగట్టోడివే" అంది కూజా గదిలో ఓమూల పెడుతూ.

రత్తాలు ఎప్పుడూ అంతచనువు తీసుకొనిఎరుగదు. అందుకే "ఏమయింది రత్తాలూ" అనడిగాడు విశ్వం.

"ఇంకా ఏంగావలేంసె. ఆనారాయణమూర్తిగారింట్లో యుద్ధం జరిగిపోనాది రాత్రంతా. ఉదయం వసంతమ్మగోరు సెరఇడిసిన తమ్మలా ఇల్లంతా తిరగతా ఉండాది. సెవులకు కమ్మలు ఎట్టుకొన్నది. కళ్లకు కాటుక, ముఖానబొట్టు. తలనిండా మల్లెపూలతో ఆయమ్మ బంగారుబొమ్మలా ఉందనుకో సారూ. అంతా తమరి సల వేనంట గదా" అంది.

అయితే రాత్రి పెద్దఘర్షణే జరిగి ఉంటుందనుకొన్నాడు విశ్వం కాకపోతే గత మూడు సంవత్సరాలుగాఉన్న కట్టుదిట్టం ఒక్కరోజులో పేలిపోవడమంటే దానివెనుక నారాయణమూర్తి పట్టుదల ఎంతోఉండాలి అనుకున్నాడు. ఆతను తన మాటలకు విలువ నిచ్చినందుకు ఎంతో సంతోషించాడు విశ్వం.

"నీకు ఇవన్నీ ఎవరు చెప్పారు రత్తాలూ"

"ఆ యమ్మగారే అన్నీ చెప్పింది. ఆయమ్మ బతికున్నంత కాలం నిన్ను మర్చిపోదు సారూ" అంటూ వెళ్ళిపోయింది రత్తాలు.

వసంతకు తనపైఉన్న అభిమానానికి ఎంతో పొంగిపోయాడు. యధాప్రకారం నారాయణమూర్తి ఇంటికి వెళ్ళాడు. ఆయన చిరునవ్వుతో లోపలికి ఆహ్వానించాడు. పిల్లలూ, నారాయణ మూర్తి భార్య ఆనందంగానే ఉన్నారుగాని సనాతన భావాలుగల అతని ముసలి తల్లి మాత్రం విశ్వంవైపు కోపంగా చూస్తూ లోపలికి వెళ్ళిపోయింది

ఓ అయిదు నిముషాల తరువాత అందంగా అలంకరించుకొని ట్రేలో కాఫీకప్పు పట్టుకొని వచ్చింది వసంత. తలనిండా కొంగు కప్పుకొని ఉంది చిరునవ్వు ముఖంతో ఉన్న ఆమె ఇప్పుడు విశ్వం కంటికి సంపూర్ణ గృహిణిలా కనిపించింది.

"కాఫీ తీసుకోండి"

నిశ్శబ్దంగా ఉన్న సాయంసమయంలో వీణ పలికినట్లుంది ఆమె గొంతు.

ట్రే పట్టుకొని వణుకుతున్న ఆమె చేతివ్రేళ్ళనే ఇష్టంగా చూస్తూ కప్పు అందుకొన్నాడు. తలెత్తి చూసిన విశ్వం అందరూ తననే గమనిస్తున్నట్లు అర్థం చేసుకొని సిగ్గుపడిపోయాడు. వసంత తన చెల్లెలి ప్రక్కనే సోఫాలో కూర్చొంది.

విశ్వం ఆసమయంలో చేసిన మహత్తరమైనకార్య మొకటుంది. వారంరోజులలో రవీంద్రభారతిలో జరగబోయే భరతనాట్య పోటీలకు ఆమె పార్టిసిపేట్ అయ్యేట్లుచేయడం. మొదట నారాయణమూర్తి భయపడ్డట్లు కనిపించాడు. విశ్వం చాలాసేపు ఆయనకు నచ్చజెప్పేసరికి ఒప్పుకొన్నాడు. అదేవిధంగా వసంతకూడా

మొదట కంగారుపడింది. కాని ఆమెకూ ధైర్యం చెప్పాడు విశ్వం. ఆఉత్సాహంతో కాబోలు ఆమె నిశ్శబ్దంగా కూర్చొనిఉన్నా నేల మీద ఆనిఉన్న ఆమె పాదాలు లయబద్ధంగా కదలసాగాయి.

ఎలాగయితేనేం అందరితోబాటు వసంతకూడా ఇప్పుడు విశ్వంతో ఫ్రీగా మువ్అవుతోంది. రోజూ వెళ్ళివస్తున్నాడు విశ్వం. రత్తాలుద్వారా అతనికి తెలిసిందేమిటంటే రోజూ వసంత ఇంట్లోనే భరతనాట్యం ప్రాక్టీసు చేస్తోందని, ఈ మార్పుకు ఇంట్లోవాళ్ళ గుండెలు ఏరోజుకారోజు బెదురుతో కొట్టుకుంటున్నాయని. విశ్వం నవ్వుకొన్నాడు. ఇంకా జరగబోయే సంఘటనలు వారిని ఊపిరి కూడా తీసుకోనివ్వవని తలచాడు.

ఆరోజే భరతనాట్య ప్రదర్శన పోటీలు. విశ్వం తనఖర్చుతో టాక్సీ తెప్పించి తనే స్వయంగా ఉండి వసంతతోబాటు వసంత ఫామిలినీ రవీంద్రభారతికి తీసుకువెళ్ళాడు. ఆరోజు జరిగిన ప్రదర్శనలో వసంతకు ఫస్టు ప్రైజు వచ్చింది ఆమెలో ఇన్నాళ్ళు మరుగునపడిఉన్న కళ స్వేచ్ఛ దొరికేసరికి తన ప్రతిభను అద్భుతంగా చూపింది.

దాదాపు వారం రోజులు పడుకున్నా లేచినా నాట్యంలోని ఆమె భంగిమలు, ఆ దుస్తులలోని ఆమె భువనైక సుందర రూపం విశ్వం కళ్ళముందు కదలాడేది. ఆమె రూపం అతని హృదయంలో ముద్రించుకుపోయింది.

మరునటిరోజు తన పుట్టినరోజని ఆహ్వానించింది వసంత. భర్తపోయిన ఈమూడేళ్ళ తరువాత ఇదే ఆమె మొదటి పుట్టిన రోజు జరుపుకోవడం. ఈ సంతోషసమయంలో ఆమెకో అద్భుతమైన కానుక ఇవ్వాలనుకొన్నాడు విశ్వం. కాని ఏది ఆలోచించినా అది ఆమెకు తగదనిపించేది. చివరకు ఎలాయితేన్నేం ఓ వజ్రపు

టుంగరం కొన్నాడు. ఆ రాత్రంతా ఆలోచించి తన మనసులోని ఆలోచనలను అక్షరరూపంలో పెట్టాడు.

"డియర్ వసంతా,

నేను నిన్నిలా పిలవడానికి అర్హుణ్నో కాదో నాకు తెలియదు చొరవతీసుకొంటే నన్ను క్షమించు. నా మనసు నిండా నువ్వే నిండి ఉన్నావు. నా ప్రక్కన నీవుండాలని కోరుకొంటున్నాను. నా జీవితంలో వసంతం కురిపించమని వేడుకుంటున్నాను. పెళ్ళంటే ఒక నిర్లిప్తతను ఏర్పరచుకొన్న నేను, నిన్ను చూసిన తరువాత, నీ సద్గుణాలు విన్న తరువాత నిన్ను పెళ్ళిచేసుకోదలచాను. మీనాన్నతో ఈవిషయం అంటే మౌనంగా ఉన్నారు. అంటే అర్ధంగీకారమేగా. నీ చెల్లెలి పెళ్ళితోబాటు మన పెళ్ళి జరిగిపోవాలి. ఎక్కడ రసాభాస అవుతుందోనని భయపడకు. మొన్ననే మీచెల్లెలికి కాబోయే డాక్టరు వరుని కలుసుకొని అంతా చెప్పాను. అతను నన్నెంతగానో అభినందించాడు. ఆధునిక భావాలున్న అతని కుటుంబం దీనికి ఎంతో హర్షం వెలిబుచ్చింది. వాళ్ళు కట్నంకూడా మీనాన్న కోరికమీదే తీసుకుంటున్నారట. ఇక మా తల్లిదండ్రుల విషయంలో నీకే సందేహమూ అక్కరలేదు. ఇప్పటివరకు పెళ్ళిచేసుకోనంటున్న నేను పెళ్లికి ఒప్పుకొన్నందుకే ఎంతో సంతోషిస్తారు. ఇక నిమ్ము చూస్తే నేను కాదన్నా నీచేత నాకే తాళి కట్టిస్తారు ఆ నమ్మకం నాకుంది. శిలలా మోడువారిపోయిన నాజీవితాన్ని శిల్పంలా మలిచి జీవం పోస్తావని ఆశిస్తున్నాను. నీ నిర్ణయం నాకు వ్యతిరేకమయినరోజు నేను నీకు కనిపించను. దూరంగా ట్రాన్సఫరు చేయించుకొని వెళ్ళిపోతాను. ఆ దురదృష్టం నాకు పట్టదని ఆశిస్తాను.

నీ

విశ్వం

మరునటిరోజు సాయంత్రం నాలుగు గంటలకు బ్యాంకుకు పర్మిషను పడేసి నారాయణమూర్తి ఇంటికి వెళ్ళాడు విశ్వం. అక్కడకు వెళ్ళిన తరువాత అతని ఉత్సాహం నీరుకారిపోయింది అక్కడ పుట్టినరోజు వేడుక ఏమీలేదు. హాల్లో కూర్చొనిఉన్న ఆమె చెల్లెలు విశ్వాన్ని చూసి 'అక్కయ్య లోపల ఉంది వెళ్ళండి' అంది. అక్కడ ఎవరూ అతన్ని పట్టించుకోలేదు. అదే మొదటిసారి వసంత గదికివెళ్ళడం కావడంతో శరీరం కొద్దిగా వణికింది.

తలస్నానంచేసి లూజుగా వేసుకొన్నజడతో, కొత్త దుస్తులతో తెల్లని మేఘపు తునకలా ఉంది వసంత. విశ్వాన్ని చూడగానే లేచి నిలబడింది

"విష్ యూ హాపీ బర్త్‌డే" అన్నాడు విశ్వం నవ్వుతూ.

వసంత ఉన్నట్లుండి అతని కెదురుగా మోకాళ్ళమీద కూర్చొని విశ్వం ఆశ్చర్య నుంచి తేరుకొనే లోపలే వంగి తన శిరస్సును అతని పాదాలమీద ఉంచింది. అతనిశరీరం అభిమానంతో పులకించి పోయింది. మెల్లగా రెండు భుజాలుపట్టి లేపాడు. అదే మొదటిసారి విశ్వం స్త్రీని స్పృశించడం. ఆ అనుభూతి అనంతం.

వద్దంటున్నా వినక ఆమె వ్రేలికి విశ్వం తనే స్వయంగా రింగ్ తొడిగి తను వ్రాసిన ఉత్తరం ఆమె చేతిలో పెట్టాడు. బయట అలికిడి అయ్యేసరికి వెనుతిరిగిన అతను అప్పుడు గమనించాడు తన పాదాలదగ్గర అతికించిఉన్న కవరును. దానిమీద 'విశ్వంగారికి' అని వ్రాసి ఉంది. కవరు అందుకొని కళ్ళతోనే వసంతకు వీడ్కోలుచెప్పి హడావుడిగా గదికి తిరిగివచ్చాడు. అతని హడావుడికి కారణం ఆ ఉత్తరం. 'ఇది నాఆలోచనలను భస్మీపటలం చెయ్యొచ్చు, లేదా నానిర్ణయాలను సఫలీకృతం చెయ్యొచ్చు. ఏది ఏమయినా అందులో వసంత తన గుప్పెడు మనసును అక్షరాల రూపంలో తెరచిఉంటుంది' అనుకొన్నాడు.

గదిలో కూర్చొని వణకే చేతులతో కవరు చించాడు.

"సార్! విశ్వంగారూ!

....ఆ సంబోదనకు విశ్వం ఎంతగానో బాధపడ్డాడు. నిరుత్సాహంగా మిగతా ఉత్తరం చదువసాగాడు

"మీరు నా చీకటి జీవితంలో వెలుగు నింపారు. నిరాశతో కుంగిపోతున్న నాకు ఆశ అంటే ఏమిటో నేర్పారు. వాడి, త్వరలో ఎండి నేలరాలబోయే ఈ గులాబీని చిగురింపజేసారు. ఇక ఈ గులాబీ మొక్క మొగ్గతొడిగి పుష్పించాలంటే మీరు తోడుండాలి. ఈరోజు నాపుట్టిన తేదీ మాత్రమే. అసలైన పండుగవచ్చే సంవత్సరం మీ నీడన చేసుకొంటాను. నాది అత్యాశ అయితే ఎట్లీస్ట్ మీఇంట్లో దాసిగానయినా పెట్టుకోండి. రోజూ మిమ్మల్ని కంటి నిండుగా చూసుకొంటూ మీకు సేవలుచేస్తూ శేష జీవితాన్ని గడుపుతాను.

పై రెండింటిలో ఏ నిర్ణయం తీసుకొన్నా నేను మీకు కృతజ్ఞురాల్ని. మరే నిర్ణయమూ నేను ఊహించను.



ఇట్లు,
మీ పూజారిణి,
వసంత

విశ్వం ఆనందం అంతాఇంతా కాదు. 'నువు దాసివి కాదు వసంతా! నా ఆశవి' అనుకొంటూ ఆ ఉత్తరాన్ని ముద్దుపెట్టుకొన్నాడు.

★